సరస్వతీగ్రంథమండలి.

నాటకానుబంధములు 2.

శ్రీ

# అహల్యాశాపవిమోచనము

గ్రంథకర్త:

పప్పు మల్లికార్జునరావుగారు.

మొదటి కూర్పు

ప్రకాశకులు:

అడ్డేపల్లి లక్ష్మణస్వామి,

సరస్వతీగ్రంథమండలి,

రాజమహేంద్రవరము.

1924.



[వెల రు 0—12—0.

# అంకితము.

ఇది శ్రీ కాజులూరుగ్రామప్రతిష్ఠిత శ్రీరామలింగేశ్వరపాదారవిందసమర్పితహృదయబంభరులును, అనవరతవేదవేదాంతాధ్యయనాధ్యాపకులును, తపోనిష్ఠాగరిష్ఠులును, ఉభయభాషాసర్గళకవితాధారులును, గానకళావిశారదులును, ద్రావిడాదిదేశీయాంగ్లేయభాషాభిజ్ఞులును ముక్తాఫలసరణిలేఖనాదక్షులునునై యిపుడు స్వర్గరాజ్యసౌఖ్యంబు లనుభవించుచున్నమజ్జనకు లగు శ్రీ జగన్నాథశాస్త్రులవారిదివ్యచరణసరోరుహంబులకు భక్తిపూర్వకంబుగా సమర్పితము.

గ్రంథకర్త.

# సవరణ.

| పేజీ. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 15 | 9 | శ్రీయుఁ, బుద్ధియున్ | శ్రీనిన్ బుద్ధినిన్ |
| 21 | 7 | గుట్టలుం | జాలముల్ |
| 39 | 19 | జంతువులు | జంతులు |
| 44 | 9 | వేఢె | వేఆ |
| 64 | 18 | నమల | నజ్జ |
| 77 | 15 | దర్శ | దర్ప |

28 వ పేజీలో "స్వప్నావస్థ యైననేమి వాస్తవ మైననేమి" యుండ నగు.

# పీఠిక.

గతసంవత్సరములో "స్థూలీకృతఛాయారూపనాటకప్రదర్శనము" (సినామాకంపెనీ) వా రొకరి "అహల్యాశాపవిమోచన" మను నాటకమును బ్రదర్శింపఁ గాంచి సుప్రసిద్ధ మగుకథ గలయట్టినాటక మాంధ్రంబున లేక యుంట నొకకొఱఁతగా నెంచి యేతన్నాటకరచనకుఁ గడంగితి. కాని రాజకీయవ్యాపారపుత్తొందరలచేతను గొన్ని గృహసంబంధపుఁజిక్కులచేతను బ్రారంభించిననైదాఱుమాసములకుఁ గాని గ్రంథము పరిసమాప్తము కా లేదు. తరువాత సరస్వతీ గ్రంథమండలీస్థాపకు లగుశ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగా రొకనాఁడు కార్యాంతరప్రసంగంబునకు విచ్చేసి నాయొద్ద నున్నవ్రాతప్రతిఁ గాంచి యది నేను స్వీయముగ నచ్చొత్తింపనిచోఁ దమగ్రంథమండలిలోఁ బ్రకటింప ననుమతి నీయవలసిన దని కోరి యుండిరి. మఱియుఁ బత్తు ముద్రితపత్రములు నేను జూడ నక్కఱ లేదనియుఁ దమకార్యాలయమున నున్నయాంధ్రపండితు లగు మ॥ రా॥ శ్రీ సత్యవోలు అప్పారావుపంతులుగారే చూచెద రనియు రాజకీయవ్యాపారనిమగ్నుఁడ నగునాకు మఱియొకసౌకర్యము కనఁబఱచిరి. అందులకే నియ్యకొనుఁడు నీగ్రంథప్రకటనము తటస్థించెను. ఈయేర్పాటు గావించినందులకు వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. మఱియు ముద్రణమున కిచ్చినవ్రాతప్రతియందు నాలేఖకప్రమాదముల నోర్పుతో సవరణచేసిన అప్పారావుపంతులుగారియెడలను గృతజ్ఞుఁడ నై యున్నాఁడను.

2. కథావిధానములోఁ బై నుదహరించిననాటకప్రదర్శనమునకును మనపూర్వగ్రంథములయందలికథకును గొంచెమువ్యత్యాసము గాన నయ్యెడు. అందు ముఖ్యమైనది యహల్యావిషయము. పూర్వ

గ్రంథములలో మాయారూపమున నున్నయింద్రుని నింద్రునిగా నె
ఱింగియు నాతనిపొందున కియ్యకొనిన ట్లున్నది. పైనాటకప్రదర్శన
ములో మాయాగౌతముని మోసము పూర్తి యగువఱకుఁ గూడ ని
జగౌతమునిగానే యహల్య యెంచినట్లు జూపఁబడినది. ఈకడపటి
మార్గమే సమంజసముగ నుండునట్లు గాన్పించుటచేత నీనాటకమునం
దుఁగూడ న ట్లవలంబింపఁబడినది. కాని య ట్లవలంబించుటచే నహ
ల్యాశాపవిషయంబున దివ్యజ్ఞానసంపన్నుఁ డగుగౌతమున కజ్ఞాన
మారోపింపవలసి వచ్చును. ఈచిక్కు తొలఁగించుటకై దివ్యజ్ఞాన
ము నిర్మలచిత్త మున్నప్పుడే పొడకట్టు గావున నింద్రద్రోహము కని
పట్టువఱకే యది యుండినట్లును నది మనసునఁ బొడకట్టినవెంటనే
క్రోధ మావేశించి గౌతముని సామాన్యమానవునివలె జేసి ద్రోహ
కారణ మూహింప నవకాశ మియ్యనట్లును దిరిగి యశరీరవాక్కువ
లన సత్యము గ్రహించినట్లును నీనాటకమున మార్చఁబడినది. మఱి
యుఁ బ్రాయశ్చిత్తమాత్రమున కనులచే నహల్యయు సంతోషపూ
ర్వకముగా తనభౌతిక దేహపరిణామ మంగీకరించినటుల వ్రాయఁబడి
నది. ఈమార్పులు సరససమ్మత మగు నని నమ్ము చున్నాఁడను.

3. ఈనాటకము ముద్రణమున కిచ్చినతరువాత ఏలూరులో రా
మనారాయణకవు లనువా రిదివరలోనే యిట్టిది ప్రకటించి యుండు
టఁదెలిసి దాని తెప్పించి చూచినాఁడను. ఏకవిషయము వ్రాయుట
చేఁ గాఁబోలు కొన్ని భావనాసామ్యములు రెండింటియందును బొడ
కట్టు చున్నవి. ఇతివృత్తము భేదముగా నుంటచే ముద్రణము పూర్తి
చేయించుటకు నిశ్చయించితిని.

4. నాటకమున పాట లంతగా నవసరము లేక పోయినను బ్రస్తు
తకాలపురంగస్థలమున నవి ప్రయోగింపఁబడుచుండుటచే గొన్ని
సందర్భముల వానిని వ్రాసి యనుబంధముగాఁ జేర్చినాఁడను.

5. నాకు మొదటినుండియు నాంధ్రభాషయం దాసక్తి మెంౘైనను పాండిత్యము లేకపోవుటచేతను బ్రథమప్రయత్న మగుటచేతను నిందు దోషంబులు దొఁగలి యుండవచ్చును. గుణలేశంబు లేమేని నున్న నవి కృతిభర్తమహిమవలన ననియు దోషపుంజంబులు కృతికర్తయవజ్ఞతవలన ననియుఁ దలంపగలందులకు గుణగ్రహణపారీణు లగువిబుధులకు విన్నవించుకొను చున్నాఁడను.

రాజమహేంద్రవరము,
20—9—1924.

పప్పు మల్లికార్జునరావు.



ఈనాటకమున వచ్చుపాత్రలు

పురుషులు.

---

గౌతముఁడు—మహర్షి అహల్యాభర్త.

అత్రి—మహర్షి.

బ్రహ్మ—అహల్య తండ్రి.

ఇంద్రుఁడు
యముఁడు
వరుణుఁడు
కుబేరుఁడు } —దిక్పాలురు.

నారదుఁడు—బ్రహ్మకుమారుడు.

నిగమశర్మ
దేవలుఁడు } —గౌతమశిష్యులు.

దశరథుఁడు—అయోధ్యాపురీశ్వరుఁడు.

రాముఁడు
లక్ష్మణుఁడు } —దశరథకుమారులు.

వశిష్ఠుఁడు—పురోహితుఁడు.

సుమంత్రుఁడు—మంత్రి.

విశ్వామిత్రుఁడు—మహర్షి.

మారీచుఁడు
సుబాహుఁడు } —రాక్షసులు.

స్త్రీలు.

అహల్య—గౌతముని భార్య.

శచీదేవి—ఇంద్రుని భార్య.

మనోరంజని—ఇంద్రదూతిక.

తాటకి—రాక్షసి.

శ్రీ

# అహల్యాశాపవిమోచనము.

నాంది

ఉ. శ్రీదము లోకకంటకవిచిత్రవిభేదము సాధుమోదము౯
స్వాదువరప్రలుబ్ధబుధషట్పదనాదము వీతఖేదము౯
క్రోధవికారసంభవవినోదము శ్రీహరిదివ్యపాదము౯
సాదృతి నొందు నీనవసుమావళి మీకిడు సర్వసంపదల్.

(అని పూవులు సభ్యులపైఁ జల్లి)

మ. పదియార్వేల వధూమణుల్ గలరు నీభాగ్యంబు నాకొక్కతె౯
ముదమారంగ నొసంగు కృష్ణ యనఁగాఁ బోల్పోలు! గ్రక్కొమ్ము నా
రద నేలేనిగృహంబునుండి యన నాబ్రహ్మాత్మజుం జేగి యా
పదియార్వేవురయిండ్లఁ గన్న హరిరూపంబుల్ మిము బ్రోచుతన్

(అని నిష్క్రమించును.)

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

ఓహో! నేఁడు మహనీయు లగుసభాసదులెల్లను విచ్చేసి నవ్య నాటకదిదృక్షులగుచు కిటకిటలాడునట్లు సభాభవనమప్పుడే యలంకరించి యున్నారు. ఇఁకఁ దడయరాదు. నటి యింకను రాలేదేమో!

(అని తెరవంక చెవియొగ్గివిని)

ఆహా! ఏమి యీసంగీతము! నటి యొంటరిగా నున్నప్పుడే మిగుల మనోహరముగఁ బాడునుగదా. ఇది స్త్రీజనమంతకును సామాన్యధర్మమేమో! ఓహో ఏమి యారాగాలాపనము! శ్రోతలను మేఘమండలికిఁ గొంపోయి యువ్వెత్తుగఁ బూలపాన్పునఁ ద్రోయు నట్లును, శీతలలహరీతరంగమాలికాడోలికానివహంబుల నోలలాడిం

చునట్లును, హిమాంబుపూరధారాసారంబుల మోదుచున్నట్లును బరవశులఁజేయుచున్నది! లలితకళలందాబాలగోపాలము విదితమై వెంటనే యానందమొదవింపఁ జేయుటచే నుత్కృష్టమై సంగీతవిద్య సాటిలేనిదై యున్నది.

సీ. ఆత్మచింతలనెల్ల నణఁగఁ ద్రొక్కఁగఁ జాలు
సంగీతవిద్యకు సాటి యేది
మంచిసంగతులను మనసుఁ బట్టఁగఁ జేయు
సంగీతవిద్యకు సాటియేది
భగవంతునందు సద్భక్తి నాటఁగఁ జేయు
సంగీతవిద్యకు సాటియేది
కలకంఠకంఠుల ఘనతకెక్కఁగఁ జేయు
సంగీతవిద్యకు సాటియేది

గీ. నాదరూపంబు బ్రహ్మంబు నాఁ బనర్చి
చేతనాచేతనంబుల చిత్రగతిని
తాలుమాలుగ వృత్తులఁ దాల్పఁ జేయు
సరససంగీతవిద్యకు సాటి యేది.

ఇప్పుడు ప్రియురాలిరాగాలాపనము పూర్తియైనది. తిరిగి వే ఱొకటి మొదలిడక పూర్వమే పిలిచెదను.

నటీ. నటీ. కుటిలభ్రూకుటీ! సుగంధబంధురవీటీ.

నటి:—(ప్రవేశించి) ఆర్యపుత్రా, నమస్కారము. మీకు 'టీ' వేళ అయినదా యేమి? అన్ని 'టీ' లతో నన్ను బిలిచినారు?

సూత్ర:—(నవ్వుచు) నాకు వేళకు 'టీ' నీయక పోవుటచేతనే నటివై సార్థకనామముతో నున్నావు. నాయొక్క నిమాట కేమి? ఈసభ్యులెల్లరు నీగానామృతమునకై వేచి యున్నారు. వారి కది శీఘ్రంబుగ నొసంగుము.

నటి:—ఏఋతువును గూర్చి పాడవలెను.
సూత్ర:—సర్వసౌఖ్యప్రదంబగు వసంతర్తువును గూర్చియే పాడుము.
నటి:—చిత్తము.

[లయగ్రాహి]

మల్లెలును మొల్లలును గొల్లలుగఁ బూయఁగను జల్లనగు
తెమ్మెరలు మెల్లఁగను వీవన్
పల్లవములన్ మెసఁగి సల్లలితరావముల నుల్లమలరం బికము
లెల్లఁ దమిఁ బాడన్
ఫుల్లదళజాలముల హల్లకము లన్నియును దెల్లనగు నట్లు కడు
నుల్లసితమౌ బా
బిల్లి వెలుఁగుం దనరఁ బెల్లుగను మోదము ఘటిల్ల నసకాలు
ఋతుతల్లజము గాదే.

సూత్ర:—ఆహా! సంగీతమా! అమృతమా! యిది. నీవు కేవలము కోకిలవే!

నటి:—ఆ, ఏమి! నేను నల్లగా నుంటినని యధిక్షేపించుచున్నారా! నేను పరభృతంబనయినచో నన్ను భరించుచున్నమీరుమాత్ర మేమిజాతిలోఁ జేరుదురు?

సూత్ర:—ఓహో! "కాకీకోకిలచందమాయె గదవే కాంతామన స్నేహముల్" అను పామరలోకోక్తికి మనముభయులము గుఱి యగుచున్నాము. కలకంఠివలె హృద్యముగా గానముచేసితివన్నం దులకు నింతగాథ పెంచి నన్నుదూషింప మొదలిడితివి. నీయట్టి విపరీతజ్ఞానముగలస్త్రీలు పెక్కండ్రిక్కాలంబున బయలువెడలఁ బతివ్రతాధర్మంబులకుఁగంటుటచేతనే యీసభ్యులు నన్నిపుడొక బతివ్రతాచరిత్ర నాటకమాడ నాజ్ఞాపించి యున్నారు. అందు చేత నిప్పుడేకథనాటకమాడిన బాగుండునో చెప్పుము చూతము.

నటి:—ఆర్యపుత్రా! స్త్రీలలోఁ బతిపవిత్రాధర్మములనుగూర్చిన పోఁ
బురుషులలోమాత్రము దైవభక్తి పూజ్యమగుచుండుట లేదా?
అందుచేత భగవన్మహిమప్రకటిత మగునాటక మేదైన నాడ
వలసినదిగాఁ గొందఱు స్త్రీసభ్యులు నాకాజ్ఞ యిచ్చినారు.

సూత్ర:—ఔను, అదియునవసరమే. అందుచే భగవన్మహిమయుఁ
బాతివ్రత్యమును బ్రకటిత మగునాటక మాడుదము.

నటి:—అట్టిది యేది గలదు?

సూత్ర—(ఆలోచనమభినయించి) అహో! నీమాత్రాంగమూలమున
నెట్టికథ జ్ఞప్తికి వచ్చినది! అందు నొకదివ్యమైన పతివ్రతాచరిత్ర
ముండుటయే కాక భగవంతుని సంపూర్ణావతారములోని కొంత
మహిమగూడ ననుసంధింపఁబడినది. అది యేదియో చెప్పుకొను
ము చూతము.

నటి—సరి యింకను దెలియకుండునా? "అహల్యాశాపవిమోచన
మేనా?"

సూత్ర—అబ్బో! ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టుదానవు నీకుఁ
దెలియకుండునా! నిశ్చయముగా నదియే. (అని యాశ్చర్యముతోఁ
నటివైపు చూచుచున్నాఁడు)

నటి—ఏమట్లు తెప్ప వాల్చక నావైపు చూచెదరు. మీ సమస్య
లు మీకే గాని మఱియెవరికిని దెలియవనుకొన్నారా యేమి?

సూత్ర—అందుచేతఁ జూచుచుండుట లేదు. సంగీతసాహిత్యవిశార
ద వగునీకిట్టి సంగతులు తెలియవని గాదు. నేను నీవాసరించు
కొన్న యపూర్వాలంకారశోభ చూచిచూచి తనివినొందకు
న్నాఁడను"

గీ. సుందరాంగి నహల్యను జూచి చూచి
సకలఋషిగణమును దేవనికరములును

విస్మయానందమగ్నులై నృత్తు వెడల
బ్రహ్మసభలోనఁ గొలువున్నపగిది గాదె.
ఇఁక బోవుదము రమ్ము.

(అని నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

శ్రీ

# అహల్యా శాపవిమోచనము.

## ప్రథమాంకము.

(సత్యలోకము. బ్రహ్మదేవుని కొలువు. మునీశ్వరులు దేవతలు నుపవిష్టులై యుందురు. అహల్య బ్రహ్మ ప్రక్కను గూర్చుండి యుండును)

బ్రహ్మ—మునీంద్రులారా, దిక్పాలురారా, యీ నిఖిలచరాచరప్రపంచంబున సృష్టి సతతంబు గావింపుచున్నను సృష్టి లేని యొక యపూర్వరూపరేఖావిలాసవతి యైన స్త్రీరత్నంబు సృజింప నిశ్చయించిన వాఁడనై నా సృష్టిచాకచక్యము లోకమునకు జూపింపఁ దలఁచి యహల్య యను నీకన్యకామణిని నిర్మించినాఁడ. సత్కావ్యమును రచించిన కవీంద్రునివలెను సుందరప్రతిమను విలిఖించిన చిత్రకారునివలె నీ సృష్టిచే సంతుష్టాంతరంగుఁడనై గర్వపడుచున్నాఁడను. కాని వనితలు బాల్యప్రాయంబునఁ దలిదండ్రుల కత్యంతానందకారిణు లయ్యు, యౌవనప్రాదుర్భావంబునఁ గొంత విషాదకారిణులు గాక పోరు. అయ్యది వరాన్వేషణవిషయంబున నని మీకెల్లరకుఁ దెల్లమే కదా.

చ. సురుచిరరూపవంతుఁడొ విశుద్ధకులప్రభవుండొ విద్యలన్
గఱచినవాఁడొ ధర్మపథగామియొ భూతిసమన్వితుండొ భా
సురయశుఁడో వరుండనుచుఁ జూచుట నైజము కన్నవారి కా
సరసి వచింపుఁ డట్టి సుగుణాన్వితు నీభువనాళి నెవ్వఁడన్.

నారద:—తండ్రీ, మీవంటి జగత్కర్తలకే యీవిషయ మింత యాలోచనీయమై మనోవ్యాకులత కలిగించుచున్నచో సామాన్యసంసారుల కెట్లుండునో గదా!

మ॥ వనవాసంబులు మోచి కాంచి ప్రజలన్ ఛాయంగ రక్షించి యి
ష్టవరంబుల్ సమకూర్చి పెంచి యటుపై సంసారభారంబు దా
ల్పు నరాన్వేషణ సేయుచో జనకు లే పాల్గొందఁ బోరాదు కో
భువనంబుల్ సృజియించు నీకె యిటులై పుట్టంగనౌ దేహముల్.

అయినను త్రికాలజ్ఞుండ వగు నీకన్న నీవిషయంబున నిర్ణ
యింప సమర్థుండెవండు?

అత్రి:—ఔను, ఈనారదుఁడు చెప్పినది లెస్సగా నున్నది.

బ్రహ్మ:—ఎవ్వరికేని స్వవిషయంబున మతి పరిభ్రమించి సరి
యైన యూహకు రానీయదుగదా. అందుచే స్వముఖంబున
కద్దంబు వలె స్వవిషయంబున కితరులయాలోచన యావశ్యకమై
యున్నది.

ఇంద్రు:—దీనికై యింత యాలోచన యేటికి? సకలక్షోణీధరపక్ష
క్షోదదక్షం బయిన దంభోళిచే జంభాసు రాదినిఖిలరాక్షసవీరులఁ
దునుమాడి త్రిలోకరాజ్యం బనక్రవిక్రమలీల నేలుచు సవనతంత్రం
బులన్ హవిర్భాగంబులు గొనుటలోఁ బ్రాముఖ్యత గాంచిన యీ
దేవేంద్రున కొసంగినచో నీనందననందనోద్యానంబున నమందా
నందంబున విహారంబు సలుపుచు దేవతాసహస్రంబుచే నూడిగంబు
లుఁ గొనుచు సుఖింపఁగలదు.

యముఁడు:—అఖండబ్రహ్మాండజీవరాసుల పుణ్యపాపవిభాగంబులు
నిష్పక్షపాతంబున నొనర్చుచుఁ బాపులఁ జండశాసనంబున దం
డించుచు నుత్తములఁ బుణ్యలోకంబుల సమస్తసౌఖ్యసంపదలం
దేల్చుచు సమవర్తి యని ధర్మమూర్తి యని ఖ్యాతి వహించిన
యీదండపాణిదండ నండగొనినచో నీదుహిత సమస్తహిత
సహిత యగునని నమ్మెదము.

వరుణుఁడు:—విధాతా. నీవుజలజోద్భవుండవు నేను జలాధిపతిని.

మనకిదివఱకే సంబంధముకలదు. నాసఖ్యంబు లేనిచో నీ యిల్లు నిలువ నేరదు. మఱియు నేను విజృంభించినచో నీనప్పాలపాల గుదువు. గనుక యిక్కన్యకామణి నొసంగి ముందు నాయిల్లు నిలువం బెట్టుము.

కుబేరుడు:—ఓహో! అగుమాగుము. ధనదుని స్నేహం బుండిన నప్పాలపా లెట్లు కాఁగలఁడు. 'ధనమూలమిదంజగ' త్తను న్యాయంబున ధనముగలవానికే సర్వసౌఖ్యములును మహాపద్మాదినవనిధుల కధీశుండనై యక్షరాక్షసగంధర్వాదులచే సంసేవితుండనైన నన్ను బరిణయంబగుచో నిఖిలైశ్వర్యంబులఁ దులఁదూఁగుచు సమస్తభోగంబుల నీపుత్రిక యనుభవింపఁగలదని వేఱ నుడువవలయునా?

గౌతముఁడు:—చతురాననా! ఈయైశ్వర్యంబులు నీభోగంబులు తపోసామర్థ్యంబున కెనగావు. తపోబలము గలవారి కెట్టి దుర్ఘటవస్తువైనను స్వాధీనమగుటయేగాక శాశ్వతానందప్రదాయకత్వముఁగూడఁ గలిగియుండు ననుసంగతి నీకనుభవైకవేద్యమే. నిగ్రహానుగ్రహసమర్థత కూడఁ గలిగి యుండుటచే నట్టివా రెల్లరకుం బ్రభువువలె గౌరవపాత్రు లగుచున్నారు. మఱియు నీయహల్య రూపసంపదయందే గాక జ్ఞానసంపదయందుఁగూడ సామాన్యస్త్రీలోకంబు నతిక్రమించుటచేత నొకతపస్వి పరిగ్రహింప యోగ్యత గలది.

ఇతర మునులు:—ఔనౌను, గౌతముఁడు చెప్పినదెంతయు యథార్థము

నార:—(తనలో) ఈగౌతముఁడు తర్కశాస్త్రవేత్త. యుక్తివాక్యములలోఁ దీసిపోవువాఁడు గాఁడు. అయిన నిట్లడిగి చూచెదఁ గాక. (ప్రకాశముగా) ఆర్యా, గౌతమా, విరాగులై తపోవృత్తినున్న వారికిఁ గన్యకామణులతోఁ బనియేమి? కామాద్యరిషడ్వర్గంబుల

జయించి నిశ్చలమనస్కులై యున్నవారికే గదా నిర్విఘ్నము
గాఁ దపంబు సాగుట.

ఇంద్రు:—(తనలో) ఈనారదుఁడు మంచిప్రశ్న వేసినాఁడు. దీని
కేమి సమాధానమువచ్చునో చూతముగాక.

గౌత:—నారదా! తపోధర్మము పరివ్రాజులకే నియమింపఁబడి యుం
డ లేదు. గృహస్థులధర్మముకూడ నై యున్నది. నిశ్చయముగాఁ
జతురాశ్రమంబుల నున్న వారికినిఁ గలదు. ధర్మపత్నిని స్వీక
రించుట కామాద్యరిషడ్వర్గంబులకు లోనైసల్పించకూడదు.
గృహస్థాశ్రమధర్మంబుల కని యెఱుంగునది.

నార:—అట్లయిన నొకానొక కన్యయే కావలెనను నిచారమెందు
లకు? ఏకన్యయైన నేమి?

గౌత:—అట్లుగాదు. ఈపరమేష్ఠిచే సృష్టంబయిన జీవరాసులలో
జ్ఞానంబునుబట్టి యనేకయంతరంబులు గలవు. ప్రత్యక్షముగాఁ
బాషాణమునందున్నప్పటికంటెఁ దరుగుల్మలతాదులయందును,
వానియందున్నప్పటికంటె జంతువులయందును, జంతువులయం
దుకంటె మానవులయందున్నప్పుడు జీవుఁడు క్రమక్రమముగా
నెక్కుడుజ్ఞానుండయి యుండుట యనుభవసిద్ధమేకదా. తదుపరి
యును బ్రవృత్తినివృత్తిమార్గానుసారులగు జీవులు క్రమంబున
జ్ఞానాధికులై యుందురు. ఒకేజ్ఞానాంతరమందున్నవారి కొకే
విధమగు నభిరుచులు నలవాట్లుఁ గలిగి యుందురు. అట్లగుటం
జేసి యట్టిస్థితియందున్న స్త్రీపురుషులు దాంపత్యవశంబున జ్ఞానా
భివృద్ధి గావించుకొని పరస్పరోత్కర్షమునకుఁ గారణభూతులగు
దురు. కావున నేదోయొక స్త్రీని వివాహమాడక సమానజ్ఞా
నాంతరముగలస్త్రీని వివాహమాడుట పురుషునకును, అట్టిపురు
షుని వివాహమాడుట స్త్రీకిని గర్తవ్యమై యున్నది.

నొక్కమాఱు సర్వాంగసౌందర్యము నిలకడగాఁ జూచి తృప్తిపొందుదు నేమో!

యముఁడు—

శా. క్ష్వేళారావసదృక్షమై విమతహృత్సీమప్రభేదంబునై
  చాలన్ మ్రోగెడు ఘంటికానినదమున్ సంధిల్ల గ్రీవంబునన్
  హేలన్ అంకెలు వైచుచున్ భుసము న్నృత్యంబు వేంచేయుచో
  నాలంబోర్వ్యక యేగు నామహిషవాహంబుండె జంకేటికన్.

నాకంటె ముందెవ్వఁడు వచ్చునో చూచెదగాక.

వరుణుఁడు—ఆ. వె. క్ష్మాతలంబుకంటె జలరాసులే యెక్కు
  వై తనర్చు భూమియందు గాన
  భూప్రదక్షిణంబు ముందుగా నాకంటె
  సలిపి మగుడి రాఁగఁ జాలు నెవఁడు.

కుబేరుఁడు—కం. నాపుష్పక ముండంగా
  నీపృథివిం జుట్టి వచ్చు టెంత యిప్పుడె నే
  నీపద్మాక్షికరంబున్
  బ్రాపింపఁగ క్షణములోన వచ్చెదఁగనుఁడీ.

గౌత—(ఏదో యాలోచించి తలపంకించి యూరకుండును)

బ్రహ్మ—ప్రస్తుతమీసభ చాలింతము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.



అహ:—(తనలో) ఈఋనిపుంగవుఁడు పాషాణంబులగూడ జీవుఁ
గనున్నాఁడనుచున్నాఁడు. ఆస్థితియందు జీవుఁడెట్లుండునో, ఎండల
కెండుచు వానలకుఁదడియుచు వానిబాధల గ్రహింపఁజాలునో
జాలఁడో తరువాతఁ దండ్రిగారి నీయంశమడిగి తెలిసికొం
దును గాక.

నార:—తండ్రీ, మీరడిగినవిషయములో నీమునీంద్రులును దిక్పా
లకాదిదేవతలును నన్యోకనినిష్టపడక యెవరికివారే పెండ్లి
కొఱకునై కూర్చున్నట్లు గన్పించుచున్నది. కావున వీరిలో
సమర్థుఁడెవఁడో నిర్ణయించుటకై యేదేని నొకప్రతిజ్ఞ నిర్వ
హింపనియమించుట యుచితమని నాకుఁ దోఁచుచున్నది.

బ్రహ్మ—ఔను. అట్లనే కావించెదను (ఆలోచనమభినయించి)
సభ్యులారా, యీనాప్రతిన వినుండు.

చ. కలుషహరంబు ముక్తిదము కామ్యసుఖావహ మాత్మబోధనా
విలసిత మగుచు నెంతయును విశ్రుతమౌ ధరణీప్రదక్షిణం
బలఘుగతిన్ జరించియు రయంబున నెవ్వఁడు ముందువచ్చు వాఁ
డలికులనీలకుంతల యహల్యకరంబును బట్టఁ బాత్రుఁడౌ.

అత్రి—ఓహో, బహుదుర్ఘటముగా నున్నదే. యోగబలము గలవా
రికి గాని యొరులకు సాధ్యము గానట్లు తోఁచు చున్నది.

ఇంద్రు—ఇది యెంతపని!

(పంచచామరము) విమానగామినై చరించి వేగమా ధరాస్థలిన్
క్రమానఁ జుట్టి వచ్చి పద్మగంధి హస్తమొందనా
యుమేశుఁడున్ రమేశుఁడున్ నిజోరువాహనంబులన్
సమానులేమి నాకు మేఘసంగతుండనైనచో.

(తనలో) ఆహా! ఏమి యీయహల్య సౌందర్యముచూచుటకీ
రెండునేత్రములు చాలకున్నవి. శరీరమంతయు నేత్రములైనచో

పువాఁడు పదునాలుగులోకాలలో నెవరునుగనఁబడలేదా యేమి?
లేక ఆమెయీయాయన అష్టైశ్వర్యములు చూచి వలచి వచ్చినదా!

నిగ:—ఛీ? నోరుమూయి. గురువుగారిసత్త్వ నీకేమి తెలియును. ఆయన బ్రహ్మదేవునిప్రతిజ్ఞ చెల్లించి మఱియు వివాహమాడి నారు గాని మఱియొకలాగునఁగాదు. ఈభూప్రదక్షిణము ముం దెవ్వరు చేసివత్తురో వారికిఁ దనకుమార్తె నిచ్చెదనని బ్రహ్మ శపథము చేసినాఁడు. అదివిని దేవతలు మునీశ్వరులు తమవా హనబలంబులు యోగబలంబులు పిక్కబలంబులు చూపుచు వెళ్ళినారు. గురువుగారు సకలశాస్త్రవేత్తగావున బాగుగా నాలోచించి యక్కడ నప్పుడే యీనుచున్న ద్విముఖయై యు న్నగోవును జుట్టి మూడుమారులు తిరిగి భూప్రదక్షిణముచేసి వచ్చితిని అహల్య నిమ్మని యడిగెనఁట. అందునకు బ్రహ్మ సంతసించి కుమార్తె నిచ్చి వివాహముచేసెనఁట. ఇదివిని దేవ తలలోఁ గొందఱు కొఱకొఱలాడఁ జొచ్చిరఁట. ఇదియథార్థము.

దేవ:—ఓహో! మంచియంత్రము వేసినాఁడే. ఓరీ. యిట్టి యం త్రములే మనము గురువుగారి యొద్ద నేర్చుకోవలెనురా, చదువు మాటకేమి ప్రాప్తముండిన నదే వచ్చును. రాకపోయిననుసరే.

నిగ:—ఓరి నిర్భాగ్యుఁడా! ఇట్టి యంత్రాలు మాత్రము చదువు లేనిదే వచ్చునఁటరా! ఎంత శాస్త్రప్రమాణము చూపించి బ్రహ్మ దేవుని సభలో నీయుక్తి చెప్పి గురువుగారు నిగ్రహించుకొని వచ్చినారో యెఱుఁగుదువా? చదువురానిదే యెందునకుఁ బనికిరాదు.

దేవ:—అటులయిన నట్టియుపాయములకుఁ బనికి వచ్చు చదు వేదో యదియే చెప్పెడనుము గురువుగారిని. దానికేమిగాని గురువుగారిభార్య మంచిదేనా? పయాంతఃకరణలు గలదేనా?

# అహల్యాశాపవిమోచనము.

(విష్కంభము)

(భూలోకము. గౌతమశిష్యులగు దేవల నిగమశర్మలు ప్రవేశించుచున్నారు.)

దేవ—ఏమోయి నిగమశర్మ, అంతయడావడిగఁ బరుగెత్తుచున్నావు. ఏదైన విశేషమున్నదా యేమి యీవేళ?

నిగ—ఓహో, దేవలా నీవేనా, అడావడి కేమి యున్నది. గురువుగారీమధ్య సత్యలోకమున కేగి యుండుటచేతఁ బాఠాలు సరిగా జరుగలేదుగదా. ఇప్పుడు తిరిగి వచ్చినారు గనుక చదువుకొందామని వెళ్ళుచున్నాను. కాని నీవెప్పుడు వచ్చినావు. గురువుగారు నె[illegible]గాఁ జూచి యిట్టే తుఱ్ఱుమని పాఱిపోయినావు.

దేవ—ఇప్పుడే వచ్చుచున్నాను. తొందరపని యుండి వెళ్లినానురా. లేకపోయినచో నాశ్రమమునుండి కదలుదునా? కాని గురువుగారెవతెనో దేవలోకపువేశ్యను దీసికొని వచ్చినాఁడనుకొనుచున్నారేమిటి?

నిగ—ఛీ; నిర్భాగ్యుఁడా! వేశ్యకాదురా; కళ్లనుగాళ్లు నుండఁ జూచుకో, గురుపత్నిదూషణ!

దేవ—అదేమిటో చెప్పకుండఁ దిట్టెదవేమిటిరా? గురుపత్ని యెవరు? గురువుగారికింకను బెండ్లికాలేదే.

నిగ—మొన్న సత్యలోకములో నయినదిరా. బ్రహ్మమానసపుత్త్రికయయిన అహల్యను వివాహము చేసికొన్నారు. ఆమె యెంతో రూపవంతురాలు శ్రీమహావిష్ణువు జగన్మోహిన్యవతారమును మించవలె ననుపట్టుదలతో నామెను బ్రహ్మ నిర్మించినాఁడఁట. మూఢులెవ్వరో వేశ్యయని నీతోఁ చెప్పియుందురు.

దేవ:—దానికేమిలే. బ్రహ్మదేవుఁడు తనకూఁతు నిచ్చుటకేమాత్ర

శ్రీ

# అహల్యాశాపవిమోచనము.

## ద్వితీయాంకము.

(గౌతమాశ్రమము, గౌతముఁడు కృష్ణాజినముపైఁ గూర్చుండి జపముచేసి కొనుచుండఁగా అహల్య యగ్నిహోత్రముచేసి పూజాద్రవ్యము లుంచును. గౌతముఁడు జపము చాలించి యగ్నిని బూజించి హోమము చేయును

గౌత:—(లేచి) అహల్యా! అగ్నిభట్టారకునకుఁ బ్రదక్షిణముచేయుదమురమ్ము. ఉభయులును ప్రదక్షిణము. చేసి యగ్నికెదురుగాఁ జేతులు జోడించుకొని నిలుతురు.)

శా. ఓ తేజోనిధి! సర్వలోకభరణా! యోయుజ్జ్వలాకార! యో
శ్రౌతస్మార్తక్రియాలవాల! హరనేత్రా! పావకా! గతికా
నీతో సాటియె వేల్పులెవ్వరును శ్రీయుత్ బుద్ధియుత్ సత్వముత్
చేత స్థైర్యము నిచ్చి బ్రోవగదవే శ్రీహవ్యవాహా! మముత్.

(అని పూజించి కొన్నియక్షతలు తనశిరసున నుంచుకొని మఱికొన్ని యహల్యనెత్తిపై వేయును.)

అహ:—నాథా! ఈయాసనమున విశ్రమించి కొంచెము గోక్షీరములఁ గైకొనుఁడు. కాలాతిక్రమ మైనట్లున్నది.

గౌత:—అట్లనే గావించెదను. (అనికృష్ణాజినాస్తరణమగు నున్నతాసనమున గూర్చుండి యహల్య యిచ్చిన పాలలో సగము మఱియొకపాత్రమందుఁ బోసి) ప్రేయసీ! ఇవి నీవు కూడ గ్రహింపుము. పరిచర్యలచే నలసి యుందువు.

అహ:—నాథా! నాకిపుడక్కఱలేదు. అవి యన్నియు మీరు గ్రి

స్త్రైపటాకారమేనా ?

నిగ:—'ఆకారసదృశోగుణగ' అన్నట్లామెయాపమునకుఁ దగినట్లే గుణములుకూడ నున్నవిరా. బ్రహ్మదేవుని యెన్నికసృష్టి యైన తరువాత దేనిలోనైన లోపముండునా? మొన్ననువచ్చినదో లేదో అప్పుడే యెన్నాళ్ళనుండియో పరిచయమున్నట్లు ముని పత్నులందఱితోడను స్నేహముగా మాట్లాడుచు మనశిష్యుల నందఱిని బుత్రులనలెఁ జూచుకొనుచు నన్నపానాదులు వారి కియనిదే తాను గ్రహింపదు. శిష్యులమాట యెందుకు? ఆశ్ర మమందున్న లేడిపిల్లలకును లతకూనలకును ముందు నీళ్ళు పోయక తాను త్రాగదు. మహాపతివ్రత. తనయొుటలిమీఁద నున్న మిక్కిలివిలువగు నాభరణంబులు మృదుదుకూలములు నాశ్రమమునకు వచ్చిన వెంటనే తనభర్తయున్కికి ననురూప ముగా నుండవని యెంచి మునిపత్నులకిచ్చివైచె. తాపసస్త్రీల కుచితమగు వేషముతో నున్నది. ఇంక నెన్నియో గుణము లున్నవి. నాపాఠమున కాలస్యమగుచున్నది. పోవుదమురా, సావకాశముగాఁ జెప్పెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.

హింస్రంబు. పరిచర్యలు సలుపుటలో శ్రమయు లేకపోవుటయే
గాక సుఖింత యుత్సాహముగా నున్నది.

గౌత:—అయినను నీవుకూడఁ గీసికొనినగాని నాకు సంతుష్టి గలుఁ
గనేరదు. నా యభీష్టము నెఱవేర్పుము.

అహ:—మహాప్రసాదము. అట్లనే చేసెదను.

(ఉభయులు పాలు ద్రాగుదురు.)

గౌత:—అహల్యా! నీవేమహారాజునో లేక నిన్ను వరింపనెంచిన
యేదిక్పాలకునో పరిణయమైనచో నీకింత కష్టములు లేక సుఖిం
తువుగదా. వారియునికికి మాయునికి నెంతయంతరముగలదు?

సీ. చంద్రశిలాకీర్ణ సౌధముల్లేవుగా
శాంతమౌ మునిపర్ణశాలగాని
తతహంసతూలికాతల్పముల్లేవుగా
వరకుశానిర్మితాస్తరణగాని
వీనులవిందుగా గానముల్లేవుగా
స్వాధ్యాయమంత్రఘోషంబె గాని
పరిచారికాజనవ్రాతముల్లేవుగా
సారంగశాబకసమితి గాని

గీ. అకట! నీరూపమునకుఁ బ్రాయంబునకును
దగిన యునికియె చాలవ్యత్యాస మయ్యె
కష్టవృత్తిని గాలంబు గడుప నయ్యె
కలికి! నను జెట్ట బట్టిన కారణమున.

అహ:—ప్రాణనాథా! ఏమిట్లనుచున్నారు? నే నేమి యపరాధ
మొనర్చితిని? నాపనులయందెచ్చటనైన బరిమత్తురాలనై యవి
వేకముచే మసలితినా యేమి? అజ్ఞానకృత మేదైన నున్న క్ష
మించి తెలియఁజేసి యీదీనురాలి విచారము తొలఁగింపుఁడు.

కలలో నైన నీయున్కి కష్టమనిభావింప లేదే. ఇది వినుండు.

సీ. మేడలు మిద్దెలు నీకొరా నె విమనని
ప్రాణేశుతోడి సంవాసమునకు
హంసతూలికశయ్యలౌ నె సుఖంబులై
పతిపాదపద్మసేవనమునకంటె
విమలసంగీతంబు వీనులవిందౌనె
పతిమృదుహితవాక్య తతికంటె
పరిచారికాదుల భాగ్యంబు సమమౌనె
స్వయముగాఁ బతిసేవ సలుపుటకును

గీ. అకట! క్షణభంగురంబులౌ యైహికముల
తగులకయె శాశ్వతానందదాయకమగు
పథముఁ దెల్పెడు మిము చెట్టఁ బట్టి యుంట
కేమి నోచితినో తొలిజామునందు.

ఈరీతి నెప్పుడు తలపోయుచుందునుగాని కష్టమనునది స్వప్న మందైనను గాంచకున్నదానను. నాథా మీకిట్టి నాదేహము కలిగించిన నాయపరాధమేదియో సెలవిచ్చి కృతార్థురాలిం జేయుదురుగాక.

గౌత:—ప్రియసీ! నీవేయపరాధము నొనర్చి యుండలేదు. నీచిత్త వృత్తి నరయఁ గోరి యట్లంటిని. నిజముగా నీకాభోగంబులే నా వలయునెడల నవి మాత్రము కొఱఁతలే. ఇదిగో చూడుము. నా తపోమహిమ (అని నేత్రములకుఁ గమండలములోని జలము రాయుచున్నాఁడు) చూచితివా.

మ. అవిగో చూడుము భర్మహర్మ్యములు నేత్రానందమౌ రత్నదీ
పవితానంబదె, తూఁగుటుయ్యెలలు మేల్పర్యంకజాలంబుల
య్యవె, భూషాప్రకరంబులయ్యవె, దుకూలౌఘుంబులవ్వే, సఖీ
నివహంబుల్ గను మిష్టమున్న నిలుమీ నిత్యంబుగా వానితోఁ.

ప్రథముఁడు—చ. ఇరువదినాల్గువత్సరములేగ.........

(అనుపూర్వోక్తపద్యమునుజదువుచున్నాఁడు)

ఋషిసత్తమా! . మేమాంధ్రదేశీయులము రయితులము. ద్వాదశవర్షక్షామంబులు పట్టి వర్షములులేక పంటలన్న నేమో యెఱుఁగక యన్నవస్త్రంబులు లేక యెంతయో కృశించి యున్న వారము.

సీ. పంటభూములు బీడుపడి బ్రహ్మచెముడుతో
నిండె దుష్టభుజంగనివస మగుచు
పచ్చికతావుల గచ్చపొదల్ గ్రమ్మె
కూరపెరళ్ళు పల్లేరు లలమె
కూపతటాకముల్ రూపుమాయుచు నింకె
దప్పికకు బక్షులు ధరణి కొఱఁగె
పశువులక్కొక్క లప్పడములగతి నెండె
వంటపొయ్యలు బూజు పట్టి యుండె.

గీ. తాప మగ్గలమయి ప్రజ తహతహ పడె
ఆధులును వ్యాధులును బట్టి యడఁచె జనుల
జీవనమె దుస్సహంబయి చెన్ను దక్కె
కటకటా! ఏమివర్ణింతు క్షామబాధ.

గౌత:—ఏలయింత చిక్కుపడుచున్నారు? నాయాశ్రమంబున నెన్ని దినములయిన మీరాలుబిడ్డలతో నెంతమందరైన నుండవచ్చునే. నేననుదినము తపంబునకుఁ గూర్చుండుటకుమున్ను పుడిసెడువిత్తనము లీవనస్థలిని జల్లుదు. అవి పరమేష్ఠివరప్రసాదంబుచే నాతపంబు ముగియుసరికె మొలకలెత్తి ఫలించి యాహారమొసఁగుచున్నవి. దాని నెందఱో యనుభవించుచున్నారు. మీరు నట్లు చేయుఁడు.

అహ:—ఆహా ఏమి యీచిత్రము.! సమస్తవైభవంబు లొక్క క్షణములోఁ బరికల్పించితిగే. కాని కృత్రిమంబు లగునానగర రామణీయకములకంటె నీయాశ్రమమందలి ప్రకృతిదేవతసహజ సౌందర్యమే నాకెక్కుడుప్రీతి గొల్పుచున్నది.

గౌత:—అట్లయిన నాసృష్టి యిప్పుడే లయింపఁజేసెదను గనుము. (అనిమంత్రజలంబులఁజల్లును)

అహ:—ఓహో యెంతలో మటుమాయమైనది! దానివలని సౌఖ్యములు నష్టేగదా! నాకవియంతగా రుచింపవు.

గౌత:—ఔను. తామరపద్మమే గృహముగా నేర్పరుచుకొన్న మహానుభావునికూఁతురవునీకుకృత్రిమనిర్మాణముటెట్లురుచించును?

(తెరలో)

అయ్యో, గౌతమాశ్రమమెక్కడ? ఎంతదూరము నడిచినను గానరాకున్నదే! ఆఁకలిబాధచేతఁ గృశించుచున్నారము. ఎక్కడ గౌతమాశ్రమము? ఎక్కడ గౌతములవారు?

చ. ఇరువదినాల్గువత్సరము లేగె చిటుక్కున వర్షబిందు వేన్
గురిసియుటలేదు హోమములు ఘోరములై భువినిండె నెంతయున్
ధరఁగల ప్రాణికోటి కడు తల్లడమందెను క్షుత్పిపాసలన్
మరణపుబాధ చెందుచును; మన్నవె యన్నముపెట్టి గౌతమా.

అహ:—(లేచిచూచి) అయ్యో, ఎవరునాయనలారా! మీరు గౌతమాశ్రమము వెదకుకొనుచున్నారు. ఇదే గౌతమాశ్రమము రండి. ఇటు ఇటు. మీకుఁ గావలసినంత యన్నము పెట్టెదను రండు.

(అంతటఁ గొందఱు ఋత్విజులు ప్రవేశించుచున్నారు)

బాబో రక్షించండి! రక్షించండి (అనిసాగిలఁబడుచున్నారు)

గౌత:—లెండు, లెండు మీకేభయమును లేదు. కూర్చుండి సావకాశముగా మీవృత్తాంతము దెల్పుఁడు

ప్రథముఁడు—స్వామీ మహాప్రసాదము. మహాప్రసాదము. మాకు
గావలసినదదే. ఆనదికి తమనామధేయ ముంచుకొని గౌతమి
యని తరతరంబులదనుక వాడుకొనుచు సుఖింపఁ గలము.
మాకింక సెల వొసంగుఁడు.

గౌత:—గోదావరిచేఁ బవిత్రమగుమీ దేశము ముం దెట్లుండునో
తెలియఁ జెప్పెద వినుండు.

ఉ. ఎచ్చటఁ జూచినం గనుల కింపగు ధాన్యపురాసిగుట్టలుం
బచ్చికపట్లు నిర్మలజలంబులు తీయనిపండ్లతోఁటలున్
మచ్చిక హాయిగా దిరుగుమందలు గూడిన గోగణంబుతో
హెచ్చగు సంపదల్ గలిఁగి యింద్రపురంబును ధిక్కరించెడున్.

రైతులు—అబ్బో అంతభాగ్యమా మాకు అంతభాగ్యమే. ఏమో
మీరు దైవముతో సమానులు ఏమిచేసినను జేయఁగలరు.

గౌత—ఇప్పుడంతభాగ్యమా యనుచున్నారు. పట్టిన తరువాత
నన్ను మఱచుటయేగాక నాసంతతివారిని తృణీకరించుస్థితికిఁ
గూడ మీలోఁగొందఱు వత్తురు. ఇఁక ప్రొద్దుపోయినది. మీరు
పొండు.

రైతులు—మీయన్నము తినుచుఁ మిమ్ము మఱచి నట్లయినఁ
గళ్ళను గాళ్ళ నుండఁ జూచుకోవద్దా బాబూ? సెలవియ్యండి.

అహ—ఆఁకలిగొనియున్నామంటిరి. అన్నముతినిపొండు.

రైతు:—అమ్మా, మాకు శాశ్వతముగ నన్నము పెట్ట వరమిచ్చి
యే యున్నారు. ఇంక వేరె యన్నమిపుడు వలదు, తల్లి.

అహ:—అట్లయిన నీక్షీరంబయిన త్రాగుఁడు.

(అని అందఱకును బాత్రలతో క్షీరమిచ్చిన త్రాగుదురు)

రైతు:—అమ్మా, నీయాదరణవల్లను నీక్షీరములవల్లను మాకుఁ
గడుపునిండినది. సెలవిమ్ము పోయివచ్చెదము.

ద్వితీయుఁడు—ఆర్యా, మామనవి వినుఁడు. మీరు సెలవిచ్చిన మార్గము మాకు సంపూర్ణసౌఖ్యము నీయఁజాలదు. ఎంతకాలము మాజన్మభూమి విడిచి యొకగృహస్థునియింట తినుచుఁ గూర్చుండఁగలము. మాయింట మేముండి గంజిత్రాగుచున్నను అది షడ్రసోపేతభోజనముగా నుండును. ఒకరింట షడ్రసోపేతముగాఁ బెట్టినను పెక్కుదినంబు లుంటకు మనసంగీకరింపదు. మేమజ్ఞానుల మగుటచేత నిట్లు మోటుతనముగాఁ బల్కుచున్నందులకు క్షమింపుఁడు.

గౌత:—అటులయిన నన్నిప్పు డేమిచేయు మనెదరు? మీయభిప్రాయమేమి?

ప్రథముఁడు—మహాప్రభో! మాకోరిక యేదనఁగా మాకే యనావృష్టి యధికవృష్టి బాధలతో నిమిత్తము లేకుండ శాశ్వతముగా నన్నము పెట్టింపుఁడని.

ద్వితీయుఁడు—తుదకన్నమున్నను లేకపోయినను స్నానపానాదులకు లోపములేకుండఁ దగినంతతీర్థవసతినైనఁ గలిగింపఁ గోరుచున్నాము.

గౌత:—ఓహో! మీభూములు దేవమాతృకలుగా నుండక నదీమాతృకలుగాఁ జేయుమని మీకోరికయా? అది బహుదుర్ఘటమే (అనికన్నులుమూసికొని యాలోచించి) సరే తెలిసినది. మీకోరిక నెఱవేఱును లెండు. నేను వెంటనే తపంబున కరిగి పరమేశ్వరు ప్రార్థించి యాతని జటాజూటమున నున్న గంగను బడమటికనుమల ప్రాదుర్భవింపఁజేసి మీదేశములగుండ ప్రవహింపఁజేసి సాగరసంగమమగునట్లు చేసెదను. అయ్యది గోదావరి యనుపేరితోఁ బరగుచుండు. ఇది యంతయు వారముదినములలో జరుగును లెండు. మీయిండ్లకుఁ బొండు.

కొనెదరు.

గాత:—నే నీకార్యమవలంబించుటకు రెండుకారణములు గలవు. మొదటిది లోకోపకారకత్వము రెండవది తాను నష్టము కరి యింపని-చో బంటులు బండ వనుకొను దేవేంద్రునికి గర్వభంగ మగుట.

గీ. చెడుగుచేతల నెవ్వరేక్ జేయ నెంచ
మంచిపనులుగ బుద్ధిచే మార్పనగును
వసుధ నడగాడ్పు లార్ద్రమా వట్టివేళ్ల
తడకమూలమునక్ జల్లఁబడినయట్లు.

ఇఁక ప్రొద్దుపోయినది శయనింతము రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

అహ:—మంచిది. [రైతులుపోవుచున్నారు]

నాథా, వీరికి వంటఁజేసికొన నక్కఱ లేకుండఁ దిండి పెట్టెద మన్న నాశ్రమమునందుండక యిమ్మ శ్రమపెట్టి తాము శ్రమపడెద మందురేల?

గౌత:—ప్రేయసీ, మంచిప్రశ్న వేసితివి. నేనంతయు దివ్యదృష్టిచేఁ దెలిసికొంటి. దీనియథార్థము సంగ్రహముగా నెఱిగింతు వినుము. కైలాసంబున గంగాపార్వతులకు సవతులకయ్యము తఱుచుసంప్రాప్తముకాఁగాఁ బార్వతి మెట్టుమెట్టైన గంగను శివునిజటాజూటమునుండి దింపి భూలోకంబునకనుపఁదలఁచి యిదివరలో భగీరథునిమూలమునఁ గొంతసార మొడలించి యుత్తర దేశంబులఁ బాఱునట్లు చేసినది. ఇప్పుడు పూర్తిగా నుద్వాసన చెప్పఁదలఁచి పెద్దబుద్ధి గలవిఘ్నేశ్వరునితో నాలోచించి యీపన్నాగము పన్నినది. ఈయాంధ్రదేశీయుల లేవనెత్తి తీసికొనివచ్చి ముందు మాట్లాడిన దావెనకయ్యయే సుమా!

అహ:—అహో, ఏమి చిత్రము దేవతలకుఁగూడ మాత్సర్యములు సవతిపోరులునా! పరమేశ్వరుని యభిమతప్రకార మేల యీ పార్వతి యుండఁ గూడదు? ఆమె జ్యేష్ఠురాలు గావున గంగాదేవి యేల విధేయురాలై యుండఁగూడదు. ఊరిపిచుగు వీరిసెట్టిని గొట్టుకపోయినదన్నట్లు వీరిపోట్లాటలు మధ్య మధ్యమలోకవాసులకుఁ గాటకంబులు పుట్టింపనేల? ఈకుట్రలు మహానుభావుండగునీశ్వరునకుఁ దెలియకుండునా?

గౌత:—తెలియకేమి? మహాత్ములు తమకుఁ గొంత యిబ్బంది కలిగినను లోకోపకారకమైనపనిలో నడ్డురారు. కావున నాయన తటస్థుఁడై యుండెను.

అహ:—మీరేల యీకుతంత్రములకై తపము వ్యయముగావించు

వ్యభిచారికి లభించు పరమపతివ్రత
చక్కని భార్యయగా సంపనకును
విద్వాంసు నెప్పుడు విత్తహీనునిఁ జేయు
సద్ధహీనునకు సూహాలు ఘటించు
గీ. తెలివిగలవాని కోపిక గలుఁగకుండు
ప్రేమఁ జూపెడు పితరుల విడుచు కొడుకు
నిట్టి విపరీతఘటనల సృష్టి చేయు
కతన ధాతకుఁ బూజ్యత గలుగ దయ్యె.

నరే. ఇఁక గడచినదానికి వగచినఁ బ్రయోజన మేమి? అకాంత యన్యకాంతయైనప్పుడు నేను విముఖుఁడ నగుటయే న్యాయము గదా. ఆహా! అట్లుండ సాధ్యమగునా?

సీ. పూర్ణేందుబింబమై మోము గాంలిక యున్న
నగవక విముఖుండ నగుదునేమొ
తళుకుఁజూపులు తేళ్ళ నళికింపకున్న చో
నగవక విముఖుండ నగుదునే మొ
దరహాసచంద్రికల్ తాపమార్పక యున్న
నగవక విముఖుండ నగుదునేమొ
పొలఁతిమేనివసించిపలపు లోలయకున్న
నగవక విముఖుండ నగుదునేమొ
గీ. చెలువ చెలువంపుసృష్టి యై చెలఁగకున్న
నగవకుండఁగ విముఖుండ నగుదునేమొ
సుదతి నను దమిచూడ్కులఁ జూడకున్న
నగవకుండఁగ విముఖుఁడ నగుదునేమొ.
ఉ. ఆయలినీలకుంతలముఖాంబుజ మాయధరోష్ఠబింబ మా
తోయజనేత్రవైభవము తోరపుజన్గవంబిక మానితం

శ్రీ

# అహల్యా శాపవిమోచనము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

(స్వర్గలోకము, ఇంద్రసదనము. ఒకయాసనముపై నింద్రుఁడు కూర్చుండియుండును)

ఇంద్రు:—(స్వగతము) ఔరా, బ్రహ్మయంతవాఁ డన్యాయమున కొడిగట్టుకొనుచుండఁగా నిఁక లోకములో ధర్మదేవత నాలుఁగు పాదములతో నెట్లుండఁ గలదు. ఒకపాదము కుంటియయినది. తనకన్య నితరులకీయ నిష్టములేకున్నచో నొక్కగౌతమునే పిలిచి యొసంగరాదా. ఏల యీనట్టి శపథములు చేయుట? దూడ చచ్చిన చేటపెయ్య నమర్చినట్లు భూప్రదక్షిణ మొనరింపలేక గోప్రదక్షిణ మొనర్చి తత్ఫలమే యొసంగు నని మూలనున్న యేదో శాస్త్రము చూపించినంతమాత్రమున యుక్తాయుక్తములఁ బరిశీలింపక కన్య నొసఁగుట యేటిన్యాయము? అక్కటా! అడవులలోని యాకలములఁ దినుచుఁ బర్ణశాలల నివసించు జడదారి యెక్కడ? చతుర్దశభువనసమ్మోహనం బగునా యువతీరత్న మెక్కడ? ఇట్టి విరూపఘటనల చేతనే యీవిధాతకు నితరదైవములవలె లోకపూజ్యత లేకపోయినది.

సీ. కడుదరిద్రునకిచ్చు గంపెడు పిల్లల
భాగ్యవంతుని ననారోగ్యుఁ జేయు
లోభివానికి ద్రవ్యలాభంబు సమకూర్చు
మూర్ఖున కధికారపూర్వ మొసఁగు

బాయతవేణి యాహహాయలోయారపునెన్నడ లాయమాయికం
బాయసితేజుణంబు లహహా! మఱువంగ వశంబె యెన్నఁడేః.

శచీదేవి:—(వెనుకనుండి ప్రవేశించి) నానాథుఁడేనియో యాలో
చించుచుఁ బల్కుచున్నాఁడు. ఈమఱుఁగున నుండియే వినెదను.

ఇంద్రః:—ఈచతుర్దశభువనంబులలో నట్టిసౌందర్యరాశి విని కని
యెఱుంగనుగదా!

శచి:—(తనలో) ఎవ్వరీసౌందర్యరాశి? పురుషుఁడా? స్త్రీయా
పురుషులు సామాన్యముగాఁ బురుషసౌందర్యమంతగాఁ బ్రశం
సింపరు. స్త్రీయే యై యుండినోపు. నన్ను వివాహమాడిన కొ
లఁదిదినము లిట్లు ప్రశంసింపుచు వచ్చినను, జిరకాలపరిచితనగు
టచేతను స్వీయనగుటచేతను నిప్పుడీపొగడ్త నన్నైయుండదు.

ఇంద్రుఁ:—కాకిముక్కునకు దొండపండు గట్టిన ట్లీజడదారి కట్టియు
వతీరత్నమా?

శచి:—(తనలో) ఓహో! ఏవరో తాపసపత్నినిగూర్చి ప్రశంసిం
చుచున్నాఁడే! ప్రమాదము వచ్చునట్లున్నది. ఎవరామె? ఎవ్వ
రైననేమి? జడదారి కామె తగదనుచున్నాఁడు గాని తాను వ
లఁచినట్లు చెప్పియుండలేదు. ఇంకను నిదానించి వినియెదగాక.

ఇంద్రుఁ:—ఆనిర్భాగ్యుఁడగుగౌతముఁ డెక్కడ? త్రిలోకాధినాథుఁ
డనై శతక్రతువుల నొనరించిన నేనెక్కడ? నన్ను గామించిన
వనితను గుయుక్తిచేతఁ గదా సాధించినాఁడు. ఇందులకుఁ బ్రతి
యుక్తి నేనుమాత్రము పన్నలేనా? బృహస్పతితో నాలోచించిన
చక్కని యాలోచన చెప్పఁగలఁడు. కాని యీసంగతి వెల్లడిం
చిన యెడల నాయనకే యాస పుట్టునేమో. రహస్యాలోచన మె
ప్పుడు నతిబుద్ధిమంతునితోఁ జేయరాదు. ఆత్మబుద్ధియే సుఖమై
నది. నేనే యాలోచింతును.

శచి:—(తనలో) సరే, ఇఁకఁ దెలిసినది. బ్రహ్మదేవునిచే నహల్య గౌతమమహర్షి కీయఁబడినదని యీనడుమ వింటి. నానాథుఁడు గూడ నప్పు డాలోకంబున కేగినాఁడు. ఆమెయందు వలపు దగిలియుండవచ్చు. ఆమె కడుఁ రూపసి యఁట.

ఇంద్రు:—హా! అహల్యా! నాదాననైతి వనుకొంటిని. ఎంతలో దాటిపోతివి! ఎక్కడ దాటిపోదువు? తనువులు దూరమైన మనసులు దూరమా? నా డాసభలోఁ గ్రేగంటిప్రసారంబున నీమనస్సుప నాకుఁ దెల్పనే తెల్పితివి. నేను నీకై యిట్లు పరితపించుచుంటిని. మనసులు కలిసినప్పుడు శరీరములు మాత్రమెంత కాలము దూరముగా నుండునో చూచెదఁ గాక. ఫలప్రాప్తికిఁ బిపీలకమార్గము విహంగమార్గము నని రెండు తెరువు లిదివఱకే యేర్పడినవి. అందుఁ గడపటిది శ్రేష్ఠతరముగాన విమానముపై క్షణములో నిటకుఁ దెత్తును. అప్పై నావజ్రాయుధమున్నది. (అనికన్నులుమూసికొని) అదిగో! అహల్య ఎంతస్ఫుటముగాఁ గాన్పించుచున్నది!

గీ. ఏల యిటునటు తారెద వింద్రుఁ డిదిగొ
లలన నినుజూడఁ గనులు గాయలుగఁ గాచి
వేచి యుండెను జాలంబు విడిచి యిప్డె
బిగ్గఁ గౌఁగిటఁ జేర్పుమీ బిసరుహాక్షి!

(అని చేతులుఁచాచుచున్నాఁడు.)

శచి:—(ఇంద్రునిచేతులనడుమప్రవేశించి) ఇదిగో వచ్చితిని.

ఇంద్రు:—(దిగ్గున లేచిచూచివెలవెలబోయి) ప్రాణేశ్వరి! ఎంత సేపైనది నీవువచ్చి?

శచి:—నాథా, మీరహల్యాస్తవమారంభించు నరికే వచ్చియుంటిని.

ఇంద్రు:—(తనలో) ఓహో ప్రమాదము వచ్చినదే. ఇప్పుడేమని

చెప్పుదును. (ప్రకాశముగా) సఖీ! మానవకోటి నిద్రయందు సుఖించుచుండునని పలుమాఱు చెప్పగా విని యాసుఖమెట్టిదో చూడవలె నని నిద్ర కల్పించికొంటిని. అందు స్వప్నము వచ్చి గౌతముఁడు, అహల్య బ్రహ్మ మున్నగువారందఱితోఁడను నేను బ్రహ్మసభలో నున్నట్లును నేదోవాదము జరుగుచున్నట్లును గన్పడినది. అదిస్వప్నావస్థ గాని వాస్తవముగాదుసుమా.

శచి:—ప్రాణేశ్వరా, స్వప్నావస్థయైన నేమి! మీయభీష్టమే నాయభీష్టము. మీకెవ్వరిష్టులో వారే నాకునిష్టులు. కాని యొకవిన్నపము చేసికొనుచున్నాను. అది విని మీయిచ్ఛ వచ్చిన తెఱంగునఁ జేయుఁడు. మీకీదేవలోకంబునసే రంభాద్యప్సరస్త్రీలు పలువురు కలరు. వారియందఱికంటె నధికమని యొకమర్త్యభామిని నిని గూర్చి తలపోయుట భ్రాంతియని తలఁచుచున్నాను. అయినను దావలచినది రంభ యగు. ఒకరికంటె నొకరింపుగా గాన్పించిన గాన్పించవచ్చును. కాని మగనాలై తమపరి మహా మహిమ గలగౌతమునిపత్ని యై యున్నయాపతివ్రతాశిఖామణిని జెనక నుంకించుట మనకెంతయో యనర్థదాయకమని వెఁగడొందుచున్నదానను. అయ్యది హాలాహలము మ్రింగుట యు నగ్ని నొడిగట్టుటయు నగును. సర్వజ్ఞులకు మీకు నేనేఱింగించు నంతటిదానను గాను గాని మోహవివశతచే నియ్యది స్ఫురింప లేదేమోయని విన్నవించుకొనుచున్నదానను. ఇంతకన్న నిరంకుశం బగుమీచిత్తప్రవృత్తి కడ్డురాఁ జాలను.

ఇంద్రు:—ప్రేయసీ! ఏల నన్నిట్టి నిష్ఠురోక్తుల నలయించెదవు. రంభాద్యప్సరోగణంబేల? నీకంటె నీమూఁడులోకంబుల నాహృదయమాకర్షించిన వారొండు గలరా? స్వప్నావస్థలో నేదో పల్కినదాని కేలయిట్లాడెదవు? రమ్మ సందనోద్యానంబునఁ

గొంతసేపు విహరింతము. (అని చేయిపట్టుకొని నడుచుచు) (తనలో) ఆహా! యీహస్త మహల్యాహస్తమైన నాయానంద మెట్లుండును! అయ్యది యెట్లు లభించును? (ఆలోచనమభినయించి) విశ్వకర్మకూఁతు రగుమనోరంజని యిట్టి కార్యములందు నిపుణత గలది. ఆమెవలన సాధింతును గాక.

(నిష్క్రమించుచున్నారు)

## తృతీయాంకము.

### ౨ రంగము.

(గౌతమాశ్రమము—పర్ణశాల.)

అహల్యా:—గృహయజమానుఁ డింటలేనపుడు గృహకార్యము లెంత జాగరూకతతో నిర్వహించుచున్నను నిండు లేకుండును. నానాథుఁడు పశ్చిమప్రకనుమలకుఁ దపస్సున కేగి వారముదినములకు వత్తునని యెంతయో హెచ్చరికగఁ బల్కినాఁడు. నేటితో వారమగును. ఈరాత్రియో రేపో తప్పక వచ్చును. నేఁడు కాకి పలుమాఱు లఱచినది. ఎవరు వత్తురో. అతిథిపూజనంబులఁ గడుమెలంకువతోఁ బ్రవర్తిల్లుమని నాకాజ్ఞ యొసంగినాఁడు. నేనీకార్యము లిదివఱకునలెఁ జేయుచుండినను నాతఁ డింటలేనప్పుడు చేయుట కెంతయో భీతికలుగుచుండును.

క. కడు సులభం బగుకార్యము
బెడిదం బగుయజమాన్యవిధిచేఁ జేయన్
గడు దుష్కరపుం బనియును
గడ తేర్పఁగనౌను భర మొకండు వహింపన్.

(మనోరంజని ప్రవేశించుచున్నది.)

మనో:—(తనలో) ఆహా! ఈమెయే కాఁబోలు నహల్య. నిశ్చయము

గా విష్ణునిజగన్మోహనావతారంబును మించి యుండవలె నని పట్టినశపథ మానలువ నెఱవేర్చికొన్నాఁడు. అమృదాననగు నాకే యీమె వలపు గొలుపుచుండఁగా మహేంద్రు నంతటివాఁడీమెకై పలవించుట వింతయేమున్నది. కాని దుర్ఘట మగునీదూతికాకార్యమొకటి నాపైఁ బెట్టినాఁడు. ఇటు జూడ మహాతపస్వి భార్య. అటు జూడఁ ద్రిలోకాధీశ్వరుం డగునింద్రుని నాజ్ఞ. ఎటులనెఱవేర్తునోతోఁచకున్నది. అయినఁజూచెద గాక (ప్రకాశముగా) అమ్మా గౌతమాశ్రమ మిదేనా.

అహ:—(లేచిచూచి) అమ్మా. ఇదే. దయచేయుము. నే నొసంగు నాతిథ్యము గైకొమ్ము.

మనో:—నాకేమియు నక్కఱలేదు. నేఁడు భట్టారకవారము. నీకైనను దాహిగను. కొంచెము పరుండుటకు మాత్రము స్థలమిమ్ము.

అహ:—అమ్మా అభ్యంతరమేమి ? ఈయాశ్రమమెల్ల నీయధీనంబుగా నెఱుఁగుము. రమ్ము. ఇటఁ గూర్చుండుదము. (ఇద్దఱును గూర్చుందురు.) నీవిట్లొంటిగఁ జనుదెంచుటకుఁ గారణమేమి ? ఎచ్చటనుండి యెచ్చటికిఁ బోవుచుంటివో నీవృత్తాంతము నాకెఱింగింప వచ్చునేని కొంచెమెఱింగింపఁ గోరుచున్నదానను.

మనో:—నీకెఱింగించుట కభ్యంతరమేమున్నది. ఏమోకాని నిన్ను జూచినప్పటినుండియు నాసోదరిని జూచినంత నిర్భరానందము గలుఁగుచున్నది. నేను స్వర్గలోకవాసినిని. విశ్వకర్మకూఁతురిను. మనోరంజని యందురు. ఇంద్రికార్యార్థినై యొకచోట కేగుచు హాద్దుగుంక నిచటకుపచ్చితిని. గౌతమాశ్రమము భయంకరమని సుప్రసిద్ధము గదా. ఆయన యూరలేరనివిందు. నీవెక్కడ శయనింతువు ?

అహ:—అమ్మా ! నీవు నాకలోకవాసివై యుంటఁ గిమంబూజ్యురా

లవు. నన్ను సోదరీభావమున జూచుచుంటివి గాన నీసమ్ముఖము నసనె పయుండెదను.

మనో:—మంచిది. నాకది పరమసంతోషము. (ఉస్సురనుచు) ఆహా ఏమిదైవఘటన !

అహ:—ఏమి మనోరంజనీ, యట్లనెదవు? శయనప్రదేశము సరిలేద నియా? నీకేమికావలసిన నది తెప్పింతును.

మనో:—నాకేమి కావలెను? నాకన్నియు సరిగనె యున్నవి. రాజాంతఃపురముల కుసుమకోమలుల శిరములందెక్కి ప్రకాశిం చవలసినపుష్పమడవిలో నొక్కమోటుభూజము నాశ్రయించు కొని యుండుటఁజూడ విచారమగుచున్నది.

అహ:—అదేమి? నీమాటలుచూడవింతగానున్నది. ఎంత సుందర మైన పుష్పమునకైనను మొదట నీవన్న మోటుభూజమునాశ్రి యింపకయే రాజాశ్రియము గల్గునాయేమి? నీకంతవిచారముగా నున్నచో నాసుమంబుం బరిగ్రహించి యుచితస్థలంబునఁ గూర్పరాదా?

మనో:—(తనలో) ఓహో రూపసంపదయేగాక ప్రౌఢత్వముగూడ గలిగినజాణవలెఁ దోఁచుచున్నది. కార్యము సఫలమగుచున్నట్లు న్నది. (ప్రకాశముగా) ఆహల్యా నీయనుజ్ఞనడయనిదే యేసు మన ంబైనఁ బరిగ్రహింపఁగలనా?

అహ:—ఈయాశ్రిమమెల్ల నీయధీనముని యిదివఱకే చెప్పి యుం టిని గాదా?

మనో:—ఓహో నీరూపసంపదకుఁ దోడు జ్ఞానసంపదకూడ ని ట్లద్వితీయంబుగ నుండుటచేతనే మహేంద్రుఁడు నిన్నుగూర్చి స దా పలువరించు చుండును.

అహ:—అదేమి? మహేంద్రుఁ డేలపలువరింపవలెను?

మనో:—సదా కన్నులకుఁ గట్టినట్లుండఁగా నెవరు పలువరింపరు?
అహ:—అట్లుండుటకు నన్నాయన యెక్కడ జూచెను.
మనో:—బ్రహ్మసభలో నీవివాహమునకుముందే చూచెను. నీవు నా
యనను జూచి వరించియు మీతండ్రిగారి శపథముమూలమున
మఱియొకరిపాలైతివి. ఇఁక నతివిస్తరమెందుకు. చెప్పెద వినుము.
అమరవల్లభునకు సదా నీనామస్మరణము నీరూపచింతనముఁదక్క
యొండువ్యాపారము లెవ్వియు లేవు. మూఁడులోకంబులకాదు
ఈచతుర్దశభువనంబులఁగూడ నీయట్టిసృష్టివిచిత్రము లేదనివచించు
చుండు. నిన్నుజూడవలెననువాంఛ మిక్కుటమై పదిదివసంబుల
నుండి చింతామణిపీఠ మధిష్ఠించుటయే లేదు. నందనోద్యాన
మందలి కల్పతరుప్రసూనములఁ గూర్చినశయ్యయింతయు సుఖ
మియ్య జాలదయ్యె. నీరూపవయోవిలాసములకు హాయిగా స్వర్గ
సుఖంబులనందక యేల యీనట్టడవి వ్రతోపవాసాదులచే శుష్కిం
చి గాసిల్లెదు? కొంచెమాలోచన వలదా? ఇంతకాలము సేషిం
తువా? నీకనుసన్నల మెలఁగువాఁడే మహేంద్రుఁడు. ఇప్పుడై
ననేమి? జాగుసేయక సౌఖ్యమందుము.
అహ:—చాలుచాలు నీసంభాషణ.
శా. ఏమేమీ నను చుల్కఁజేసి యిటు లీపిష్టించెదే, వారకాం
తామాత్రంగఁ దలంచితో నను మదిన్ నానాథుఁడున్ విన్నను
త్రాముండున్ మఱినీవు నేమగుదురో ధర్మంబులన్నీడి మీ
మీమాహాత్మ్యములెల్ల మంటగలియన్ మేలౌనె యిట్లాడఁగన్.
మనో:—అమ్మా కోపగించుకొనకుము క్షమింపుము. నీసౌఖ్యముఁగోరి
చెప్పితిని గాని మఱియొకటికాదు. ముల్లోకముల కధిపతియైన
యింద్రునంతవాని నీవిట్లు తిరస్కరింతు వనుకోలేదు.
అహ:—తిరస్కరించుట లేదు. దుస్సాధ్యమగుకోరికలఁ గోరుట

యనుచితమని నామానవిగా నిట్లు పురందరునితో నుడువుము.

ఉ. సుందరుఁడైన చంద్రు నటు నాచుట గాని వశంబె ముద్దిడన్
అంగనినమ్రానిపండులకు నట్టులు సాచిన లాభమానె యే
మందు వివేకమెల్ల నడుగంటును కాముకపాళి కయ్యయో
నందననూచరింతు నిఁక వద్దను మిట్టి వృథాప్రయత్నముల్.

మనో:—పోని మ్మాయనమాటకేమి గాని నీనిందుజవ్వన మిట్లడవిపా
ల్సేయవలసినదేనా. సుఖా సేకు లేదా?

అహ:—అమ్మా నీకేమి యీవెఱ్ఱి! నేను కష్టపడుచుంటి ననుకొను
చుంటివా? నాకున్నసుఖము మీస్వర్గలోకమం దేకాంతకును లే
దని నమ్ముము. మీరచ్చట ననుభవించునది సుఖాభాసము గా
ని యథార్థసుఖము గాదు. నిరంతరపతిపాదపద్మసేవవలన గలు
గు సుఖమింతింతనరాదు. అందును గౌతముఁడు మహానుభావుఁ
డు. మాహాత్మ్యంబున నింద్రాదిదేవత లాయనతో సరిపోల్పఁ
దగరు. ఇఁక పొద్దు పోవుచున్నది. ఈవిషయంబులను బలివ్రి
తాధర్మంబులును మనముపరుండి మాట్లాడుకొందము లోనికిఁ
బోదము రమ్ము.

(తీసికొనిపోవుచున్నది.)

తృతీయాంకము.

రంగము. ౬

(స్వర్గలోకము ఇంద్రుఁడును మనోరంజనియుఁ జెరియొకయాసనముపైఁ
గూర్చుండియుందురు.)

ఇంద్రు:—మనోరంజనీ, నేటిదినము తెల్లవారుసరికి వచ్చెద నని చెప్పి
యేల యింతతడవు చేసితివి? గడియ యొకయుగ మన్నమాట
మఱచితివా? నీవిప్పుడు రాకున్న యిఁకనీయింద్రుని జూడఁగలు
గుదువో లేదో

మనో:—మహేంద్రా! ఇప్పటికైనను వచ్చితివి సంతోషించితిమి. ఆదుర్మార్గులు వెనుక తరుముకొని వచ్చుచున్నారేమోయని యింకను గుండెలు తడతడ కొట్టుకొనుచునే యున్నవి.

ఇంద్రు—(ఆత్రముతో లేచి) ఎవ రాదుర్మార్గులు? ఏదీ వజ్రాయుధము.

మనో—ఇచ్చ టెవరును లేరు కూర్చుండుము. నేనంత చేతకానిదాననైనప్పుడుగదా నీవజ్రాయుధమునకుఁ బని. ఎవరో మానిసిబసు బహు లనురాక్షసులఁట. నేనొంటరిగా వచ్చుచుండుట జూచి తమయేలిక యగు రావణుని యాజ్ఞయైనదని నన్ను బట్టుకొని గొంపోనఁ దొడఁగిరి.

ఇంద్రు—ఆ, ఆ, ఎంతపరిమాదము, ఎంతప్రమాదము! అప్పుడు నిన్ను రక్షించు వారెవరు? నన్నెంతగా నిందించియుందువో! కాని నేనుండినచో నాదురాత్ముల నాఖరతరాసికి వెంటనే బలి యిచ్చి యుందును. ఈరాక్షసులు మొదటినుండియు బరస్త్రీలఁ జెఱపెట్టి లోకమున కుపద్రవములఁ గావించుచున్నారు. కాని యెట్లు తప్పించుకొంటివి?

మనో—బుద్ధిబల ముపయోగించినఁ దప్పించుకొనుట కేమికష్టము. నన్ను వారట్లు తీసికొనిపోవుచుండఁగా, ఓరీ మీకుఁబెండ్లి యైనదా యనియడిగితిని లేదని చెప్పిరి. అందుపైన మీరు నన్ను రావణునికడకేల గొంపోయెదరు. మీలో నొకరు వివాహము కారాదా అనియంటిని. అది వినినతోడనే వారునన్నొకచోటఁ గూర్చుండఁబెట్టి నేను వివాహమాడెదను. నేను వివాహమాడెదనని వాదులాడఁ జొచ్చిరి. తుదకు నీవెవరి వివాహమాడెదవని నన్నడిగిరి. నేనందుపై మీలో నెవ రాగిరి శృంగంబున కేగి ముందిటకు వత్తురో వారిని బెండ్లియాడుదు నని చెప్ప వారెనుట

. గవ్యూతిమాత్రిదూరమున నున్నకొండవైపు పరుగిడఁ జొచ్చిరి.
నేను రివ్వున మింటికెగసి యిటకు బాఱి వచ్చితిని.

ఇంద్రు—ఓహో, ఎంతచమత్కారము చేసితివి! నాకై యిట్టికష్ట
ముల పాలగుచుంటివి. నీఋణ మెట్లు తీర్చుకొందును. కాని నీవే
గిన పని యేమైనది? కాయా పండా?

మనో—అంతగా కాయయు గాదు, పండును గాదు. దోరగాయ
వాటముగా నున్నది.

ఇంద్రు—అనగా?

మనో—దేవరపై మనసుండియు నహల్యకుఁ బతిభీతి మెండుగా నుం
డుటచే నంతస్పష్టముగా నంగీకరింపకున్నది.

ఇంద్రు—ఆసంగతి నీవెట్లు కనిపెట్టితివి.

మనో—ఇదిగో మీతో నిట్లని నుడువుమన్నది.

ఉ. సుందరుఁడైన చంద్రు నటు చూచుటె గాని వశంబె ముద్దిడన్
అందని మ్రానిపండులకు నఱ్ఱులు సాచిన లాభమౌనె యే
మందు వివేకమెల్ల నడుగంటును కాముకపాళి కయ్యయో
పొందనమాచరింతు నిఁక వద్దను మిట్టి వృథాప్రయత్నముల్.

దానియర్థమేమో మీరేయాలోచించుకొనుడు.

ఇంద్రు—ఔను బాగుగా గనిపెట్టినావు. సాధ్యము కాకుండటచేత
మానుమన్నదిగాని సాధ్యమైన యెడలఁ దనయభ్యంతరము లేద
నియే స్పష్టమగుచున్నది. సరి. ఇఁకనేమి చేయు మనెదవు.

మనో—రాయబారమువలన సందిగ్ధస్థితికి వచ్చినప్పుడు స్వయముగ
నేగినఁ గార్యసాఫల్యమౌ నని తోఁచుచున్నది.

ఇంద్రు—సందేహమేమి? నేను నట్లే చేయఁ దలఁచు[illegible]ంటిని. కాని
నీవు ప్రియురాలిహృదయక్షేత్రము దురూహా[illegible]కోన్మూలిత
ముగను, విషమస్థితిరహితంబుగను జేసితివిగదా

మనో—ఆ, చేసితిని. తరుణమున దేవరవారుకృపఁజేసిన యహల్యా స్థితిమాఱి సత్ఫలమిచ్చుటయే యిఁకఁ గొదువ.

ఇంద్రు—అది యెంతపని చూతువుగాని ప్రస్తుతమీపారితోషికము గ్రహింపుము (అని బహుమతియొకటి నిచ్చుచున్నాఁడు.)

మనో—మహాప్రసాదము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# అహల్యాశాపవిమోచనము.

## చతుర్థాంకము.

### రంగము. ౧

(గౌతమాశ్రమస్థానము.)

అహల్య—(పుష్పమొకటివాసనజూచుచు) ఆహా! ఏమి యీమాలతీ పుష్పసౌరభము! తన్ను రెండుపూటల నీరుపోసి పెంచినందులకై మంచిపరిమళముగల పూల నొసంగి యీమాలతీనికుంజము తన ఋణము మల్లించుకొన్నది. అటులనే యీమల్లెపందిరియు విరుల గంపలతో నొసంగి యాశ్రమంబున నెల్లెడల నామోదంబు సమకూర్చుచున్నది. మఱియు నీనారికేళంబులసరసతకు మేరయే లేదు. ఎప్పుడో చిన్ననాటను బోసిన జలంబామరణాంతము శిరంబున మోచి పెంచినవారికి స్వాదునీరంబు లొసంగుచున్నవి. అచేతనంబులే యిట్లు కృతజ్ఞత చూపుచుండగా జ్ఞానముగల మానవజాతి యప్పుడప్పుడు కనబరచు కృతఘ్నతఁ జూడ నాశ్చర్యమగుచుండును గదా. నేనిప్పు డింకఁ బడయరాదు. దేవతార్చనకుఁ గావలసిన సుమంబులఁ గోసికొని యగ్నిహోత్రంబులకై యిదివరకే కూర్చియుంచిన సమిధలఁ దీసికొని సత్వరంబునఁ బర్ణశాలం జేర్పవలయు. (అనికొన్నిపువ్వులు సజ్జలోనికి గోసి సమిధలకట్ట బుచ్చుకొనగాఁ గొందఱు శిష్యులు ప్రవేశింతురు.)

శిష్యు—అమ్మా! యీశ్రమ మీకు వలదు. మేమిందరము శిష్యుల ముండగా మీరేల యిట్లు శ్రమపడెదరు.

అహల్య—నాయనలారా! నాకు శ్రమలేకపోవుటయే గాక యిట్టికార్యములయందు మొదటినుండియు నభిలాష మెండగుటచే నిట్లు చేయుచున్నాను, గాని మఱియొకటి కాదు. మీరు పోయి మీ పాఠములు వల్లించుకొనుడు.

శిష్యు—మేమట్లు పోవువారము కాము. నీవు జాగ్రతపఱచిన సుమంబులను సమిధల నైన నిటు దెమ్ము. అవి తీసికొని యేగెదము. తల్లీ! గురుశుశ్రూష లేక మాకుఁజదువువచ్చునా? (అనిపూలసజ్జయు సమిధలకట్టయును దీసికొనిపోవుచున్నారు.)

అహ—ఇఁక తొందర లేదు. ఈయారామరామణీయకము కొంతసేపు కనులపండువగఁ జూచి మఱియేగెదను. ఓహో! పచ్చని పట్టుపఱుపులవలె నున్న యీపచ్చికపరిదేశముల శృంగారమేమి! అందుఁబూచినగన్నేరుపువ్వు లాకసమందలి నక్షత్రములవలె వెలుఁగొల్లుచున్నవి. నికటంబునఁ బారు నిర్మలములైన కాలువజలంబులు గులకఱాళ్లపైఁ బడి ప్రవహించునపుడు చేయు గలగలధ్వనులు పుష్పమరందాస్వాదనచే మత్తిల్లి చేయు భ్రమరముల ఝుంకారంబులతోఁ గలిసి పరభృతసంగీతనాదంబులకు శ్రుతిప్రాయంబులై శ్రుతిపేయంబు లగుచున్నవి. అవిగో! వాయువశంబున నెండుటాకులు చేయుమర్మరధ్వనుల కులికిపడి చెంగుచెంగున లంఘించు మృగశాబకంబు లెంతసొగసుగా నున్నవి! ఆహా! ప్రకృతిదేవతాసౌందర్యమే సౌందర్యము! ఈరమణీయప్రకృతివస్తువులనడుమ నెంతకాలంబున్నను నాకుఁదనివి తీరకున్నది. అదిగో! ఆకసమునుండి యేవియో హంసలు దిగుచున్నట్లున్నవి. కాదు కాదు. తద్రూపంబుననున్న యొకవిమానము. అందెవ్వరో దివ్యపురుషుఁడున్నట్లు తోచుచున్నది. ఈగౌతమక్షేత్రసౌభాగ్యంబు చూచుటకై కాఁబోలు మెలమెల్లన సనతిదూరంబున

నీవనముపై సంచరింపుచున్నారు. అదిగో! విమానము. వనము నతిక్రమించినది. ఇఁక దానితోఁ బనిలేదు. నేఁడీలతాకుంజంబు లసంఖ్యాకంబులుగఁ బుష్పములు బూచి యున్నవి. దేవబ్రాహ్మణసమారాధనకుఁ గావలసినవి గాక మిగిలినవి నానామునిశయనస్థలం బలంకరించి మృదులంబగునట్లు చేసెద.

(అనిపువ్వులు గోయుచుండును.)

ఇంద్రుడు:—(వేఱొకవైపునుండి విమానము దిగి ప్రవేశించి) ఓహో!
ఏమి యీగౌతముని తపఃప్రభావము!

సీ. కరిసంఘములతోడఁ గలసి యాడెడు సింహ
చయములు మిక్కిలి చనవుతోడ
గోవులగంగడోల్ గోకుచు కండూతి
వాయంగ జరియించు వ్యాఘ్రగణము
లేడిపిల్లలఁ గూడి లీలావిహారముల్
సలుపుబెబ్బులులక్కజముజనింప
అజశాబకంబుల నరమరలేకుండఁ
దుమ్రిళ్ళుచునాఁడు తోడేళ్ళసమితి.

గీ. పిల్లులెలుకలకును దిండి పెట్టుచుండు
ఫణిఫణంబుల క్రింద కప్పలువసించు
క్రూరజంతువులు సహజంపు వైరముడిగి.
శాంతతవహించు నిట్టులాశ్చర్యమొదవ.

మఱియు నీపుష్పారామంబులు, ఛాయాతరులు, ఫలవృక్షంబులు నెంతయు కందోయికి విందొనర్చుచు నందనవనానందంబు డిందుపఱచుచున్నవి. అదిగో! అనేకపుష్పాపచయంబొనర్చుచు బెదరులేనిచూపులఁ జూచు నాహరిణాంకవదన యహల్య అతరుమూలమున డాగి యదను వేచి ప్రత్యక్షమయ్యెదగాక (అని యొకచెట్టు

చాటున నిలిచి యహల్యపై పూవువిసరును.)

అహ:—(అదరిపడి) ఓవృక్షరాజమా! నీనిస్సేతుకమైన కటాక్షంబున కేనెంతయుఁ గృతజ్ఞురాలను. నీసుమంబుల నాపైఁ జల్లి వృథసేయుటకంటె నాహృదయప్రియుం డిటకు వచ్చినపు డాయన పాదములపైఁ జల్లి కృతార్థత నందరాదా? స్థావరరూపునకు వివేకమెక్కడ?

ఇంద్రు:—నీహృదయప్రియుఁడు స్వయముగనే నినుఁబూజించుట కిటకు వచ్చి యుండగా నీవృక్షరాజ మాతనికిఁ దోడ్పడి కృతార్థత జెందినదిగా భావింపుము.

అహ:—ఎవరిదీ యశరీరవాక్కు (అని యిటునటు పరికించి చూచి) ఏవరును గాన్పించుటలేదే. నామనోహరుండిటకు వచ్చిన నాకుఁ గన్పడకుండునా?

ఇంద్రు:—(తనలో) నన్నే స్మరించుచున్నదని తలఁచెదను ప్రవేశించుటకిదే మంచిసమయము (ప్రకాశముగా) తలోదరీ! నీకు గన్పడకుండ నీప్రియుఁ డెంతసేపుండఁగలఁడు? పొద్దుతిరుగుడుపువ్వు సూర్యుఁ డెటుతిరిగిన నటేతిరుగునుగదా! (అని యెదుటనిలుచును)

అహ—(ఉలికిపడియోసరిలుచు) అయ్యో! మీ రెవరు? స్త్రీలొంటరిగనుండుచోటున కిట్లుహఠాత్తుగా వచ్చుట యుచితమా?

ఇంద్రు—తరుణీమణీ!

మ. మూడు లోకములందు నెవ్వని పూజసేయ ననారతం
బీడులేని సమస్తవైభవ మెవ్వఁడొందును? శత్రులక్
దోషులేకయె వజ్రముక్ గొని దున్మిలోకము లేలుచున్
వాఁడొ యాసురశేఖరుండిట వచ్చె క్షేమముగన్గొనన్.

మేము స్త్రీపురుషవివక్షత లేకుండ సమస్తప్రాణులయోగక్షేమము కనుగొనవలసి యున్నదిగాన సర్వస్థలంబులు నరమరిక లేక

హుటాహుటి సేగుదుము. ఇప్పుడిట వచ్చుటనీకుఁదప్పుగఁదోఁచెనా?
(అని మందహాసముచేయుచున్నాఁడు.)

అహ—త్రిలోకాధినాథా! నమస్కారము. అజ్ఞానముచే మనుష్య మాత్రుఁడుఁగా భావించి పలికిన పలుకులు మన్నింపుఁడు. మీరు తండ్రులు. మేము బిడ్డలము. అట్టిచో మీరుచొరరాని ప్రదేశం బు నియ్యెడఁ గలుఁగవు. ఆపర్ణశాలం దపోనిష్ఠనున్న మత్ప్రాణేశ్వరుండగు గౌతముండు మిమ్ముల వీక్షించినచో నుచితసత్కారంబులు సేయును. మీరచటికి దయచేసి వానిం బడయఁగోరుచున్నదానను.

ఇంద్రు—(తనలో) ఓహో ఏమిజాణతనము! భర్త తపోనిష్ఠలోనున్నాఁడనియు నిదేసమయమనియు సూచించుచున్నది. అయిన నిట్లందును (ప్రకాశము) ఏమి! తపోవిఘ్నమొనరించుటకు నన్ను రాక్షసునిగాఁ దలఁచితివా యేమి! ఈగౌతమునికంటె వేయిమడుంగు లెక్కువతపమాచరించి యింద్రపదవిని బొందియున్న నాకు నొరులతపోవిఘ్నమొనరింప మనసెట్టులొప్పును? ఏమి నీవాతని యర్ధాంగివి కావా? గృహమేధి ధర్మంబులెఱుంగవా?

అహ—(ఆత్రముతో) అర్ధాంగిని గాకేమి మహాత్మా! నేనైనను నిచటఁ బరికరలోపంబుచే మిమ్ముఁ బర్ణశాలకుం గొంపోయి సత్కరింపవలసి యున్నది. కావున దయయుంచి యచ్చటికి దయ చేయుఁడు.

ఇంద్రు—(తనలో) ఆహా! నాకీమెయం దెంతయనురాగమో యీమెకును నాయందంత యనురాగమున్నట్లు మాటలవలన స్పష్టపడుచున్నది. (ప్రకాశముగా) జవ్వనీ! నీయభిమతము తెలిసినది అదిత్రోసిపుచ్చుట కీయింద్రుఁ డంతకిరాతుఁడు గాఁడు. నీకోరిక ననుసరించియే వర్తింతునని త్రికరణశుద్ధిగా నమ్ముము. ఇచట

సత్కరించుటకుఁ దగిన పరికరములు లే వంటివి. కార్యసాధనము లోఁ బరికరహీనత బుద్ధిమాంద్యుల కొకసాకు గానిబుద్ధిమంతుల కదియెంతమాత్ర మడ్డురాదు. ఈచెట్టుమొదట నింతయెత్తుగా రాలిన మృదులసుమంబులుండఁ బరికరములకై విచారించెద వేల? దివ్యాంశసంభూతురాలవై యున్నను నీజడదారుల సహవాసదోషంబున బుద్ధిజాడ్యతనొందితివి గాఁబోలు. లేకున్న నీకుపాయము నేను జెప్పవలసినదా?

అహ—మీరు సెలవిచ్చినట్లు నేనజ్ఞానురాలను. నాకు గౌతముఁడుపదేశించిన మార్గము కంటె వేఱువిధమున నతిథిసత్కారము సేయుటెన్నఁడు నెఱుఁగని దానను. పూజాద్రవ్యంబులలో నొక్క సుమంబులువినా యన్యమెవ్వియు నిచట గానరావుగావున నాశ్రమమునకు శ్రమ మనుకొనక విచ్చేయుఁడు.

ఇంద్రు—అబలామణీ! వచ్చునపు డాశ్రమమునకును వచ్చెదము. కాని యిప్పుడిచటనుండియే తెలియవలసియున్నది. కావున జాగు సేయక నీమనోరథసిద్ధి వడయుము. ఏకార్యమున కేని చిత్తము ప్రధానమా పరికరములు ప్రధానములా చెప్పుము.

అహ—చిత్తము.

ఇంద్రు—అటులైనచో నది నాకొసంగుము చాలును. అప్పుడీ సుమంబు లెట్టి పరికరంబులౌనో నీవే చూచెదు గాని.

అహ—నేనేకార్యంబుచేసినను త్రికరణశుద్ధిగాఁ జేయ నలవాటుపడి యున్నదాన. అందుచేనీకార్యంబున వేఱె చిత్తమర్పణచేసెదనని నుడువ నక్కఱలేదు.

ఇంద్రు—(తనలో) అబ్బా! ఇంత స్పష్టముగా నీమె తనప్రేమ వెల్లడి చేయుచుండఁగా నామనోరథసిద్ధి వడయకుండ నింకను జాగుసేయుట నాదే మూర్ఖత. (ప్రకాశముగా) లలనా! అమృతోపమా

నంబులగు నీవాక్యములచే చాల నలరితి. పుష్పంబులచే నతిథిస
త్కారము చేయుమెఱుంగ నంటివి. అదియెట్లు చేయవలెనో
ముందు నేను నిన్నతిథిగా భావించిచేసి చూపెదను. తరువాత
నీవొనర్చి నీయభీష్టము వడయుము.

(అని కొన్నిపుష్పముల గొని యహల్యను సమీపించు చున్నాఁడు)

అహ—శచీధవా! నన్ను డాయకుము. నీవు త్రిలోకాధినాథుఁడవై
యును నీహద్దులో నీవుండి ప్రవర్తింపనిచో సామాన్యనికృష్టమా
నవునికంటె లఘుతరంబుగఁ జూడఁబడుదువు.

ఇంద్రు—యోషిద్రత్నమా! నీయౌవన రూపరేఖా విలాసంబుల
నన్నొకనినే గాదు మఱియెవ్వరినైనను దృణప్రాయంబుగాఁ
జూడఁగలదానవు. నేను సంకల్పించిన యతిథిసత్కారవిధానము
పూర్తిగాఁ జూపనిమ్ము. నన్ను గటాక్షింపుము.

(అనితిరిగిసమీపించుచున్నాఁడు.)

అహ:—(ఎడమయి) అహా! ఏమి యీమూర్ఖత. రంభాదినిఖిలా
ప్సరోగణంబులచే విరాజిల్లు స్వర్గలోకాధీశుండవై మహాపతివ్రతయగు శచీదేవికి భర్తవై యిటు లోకమర్త్యకాంతకు నందును
మునిపత్నికై యాశించుట తగునా? లోకంబుల సంరక్షింప ని
యామకుండవైన నీవే యిట్లు నీతిబాహ్యుండవై ప్రవర్తించినచో
నిఁక లోకంబున నీతి యెట్లుండఁగలదు. వెలుఁగే పొలముతు మే
సిన కాపాడువా రెవ్వరిఁక. కావున నీయుద్యమము నుండి వెంట
నే తఱలి పొమ్ము.

ఇంద్రు:—నారీమణీ! నామనం బరయఁ గోరి యిట్లాడుచుంటివా
యేమి? నాఁడా బ్రహ్మసభలో నీ కేగంటిపతిసారంబునకుఁ బాత్రుఁ
డైన యాయింద్రుఁడు కాఁడా వీఁడు? పునస్సందర్శనమున కాల
స్యమైనందుల కిట్లు కోపగించుచుంటివా యేమి?

అహ:—నాకదేమియుఁ దెలియదు. ఇంద్రుఁడవు కాని మున్మహేంద్రుఁ డవు కానిమ్ము. నీకిచ్చ కేమేనిఁ బనియున్నచో నాయాశ్రమము నంగల మదీయప్రాణవల్లభుం డగుగౌతముని సందర్శించి యాతిథ్యము గైకొని వారివలన నెఱవేర్చుకొమ్ము.

ఇంద్రు:—అబలామణీ! ఏల యీనిర్దయత్వము?

గీ. అతివ, తీయని నీయధరామృతంబు
కంటె నాతిథ్య మొండేది కలుఁగ నేర్చు
కలికి, నీదగు గాటంపుకౌఁగి లియ
వేడె నీయాశ్రమంబందు కోరికేమి.

అహ:—ఛీ దురాత్మ! ఒడలు తెలియక కాఱులఱచెదవు. శీఘ్రముగా నీవనము దాటిపొమ్ము.

గీ. గౌతముం డిట లేనట్టి కారణమున
బ్రతికిపోయెద విచ్చోటు బాసి చనుము
తీవ్రమయి యిప్పుడీజగత్త్రితయమేర్చు
నాదు కోపానలమున కింధనముగాక.

ఇంద్రు:—ఓహో సుందరాంగీ! కోపముఁ గూడ నీకొక యపూర్వ సౌందర్యము తెచ్చుచున్నదే.

గీ. కుటిలమగు భ్రూకుటిక్షేప మిటులఁ బఱపి
క్రొమ్మెఱుఁగు మేను గంపింప నూతనేక్ష
ణంబులను జూచి యధరబింబంబు గదల
పలుకు నీచిత్రనైఖరి యెలమిఁ గూర్చు.

నీకిప్పుడు కోపసమయముగా నుండుటచేఁ దరలిపోయి పునస్సందర్శనముఁ గావించుకొనెద దయయుంచుము.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

అహ:—(తనలో) ఇపుడీసంగతి గౌతమునికి నివేదింతునా? ఏల యూ

యనమనసు కలతపఱచవలెను ? ఈపురందరుఁడు నేను తనపై మోహముతో నుంటి నన్న భ్రాంతిచే నిట్లు పలుకి నోపు. ఆ భ్రాంతి నివారణ చేసితిని గదా. ఇఁక నీసంగతి యిక్కడనే మఱచిపోవుట యుక్తము.

(అని నిష్క్రమించుచున్నది.)

---

## చతుర్థాంకము.

### రంగము. ౧

(స్వర్గలోకము—ఇంద్రభవనము.)

ఇంద్రుడు:—ఆహా ! సృష్టియంతయుఁ బరిశీలించి చూచిన నీచతుర్దశ భువనంబుల నహల్యవంటిచిత్రమైన వస్తువు వేఱొండు గానరాకున్నది. సమీపించి చూచుటచే నాయువిదసౌందర్యము నా మనంబునకు మఱింత గాటముగా నాటి యున్నది. సరిపోల్పఁ దగిన వస్తువులే లేవు.

సీ. నిశివికాసములేని నీరజంబేపాటి
సాటియగా సతిమోము సౌరుతోడ
పగలు నిమీలనం బగునుత్పలం బెట్లు
తుల్యమగా సతివకన్దోయి తోడ
దరముచే నీటను దాగియుండెడు దరం
బెనయె సఖీ కంఠమునకుఁ జూడ
అడవులపాలైన హర్యక్షురాజుమధ్యం
బెట్లు చెలికౌను కౌను సవతు
గీ. కదలలేకుండుకదళికాస్కంధ మెట్లు
యువతియూరువుతోఁ బోల్ప నొప్పు నొక్క

విరసమై యేటఁబడి యొక్క వేళఁ దోఁచు
సైకతం బెట్లు సమ మింతిజఘనమునకు.

క. హేమమునకు సౌరభముఁ
గోమలతయుఁ గూర్చి ధాత కోమలి జేసెఁ
గాముని తూఁపనశర మయి
యీమెయిఁ గుందించువిరహ మెటుల సహింతుఁ.

అదిగో! సుధాకరుఁ డప్పుడే యుదయించి తననిశితకరంబుల నన్నలయింపఁ జూచుచున్నాఁడు.

ఉ. ఏమిర! చంద్ర నన్ను నలయించెద వేలర, సాటిదేనతఁ
గా మది నెంచవో నిను ననారతముఁ భుజియింతు రేల్పులం
చీమెయి వైరమూర్పుకొన నెంచితివో యహిశాఁశియా నహ
ల్యామదిరాక్షి నాహృదయమందు వసించుట నీవెఱుంగవో.

గీ. చల్లగానుండు జలధిలో జననమొంది
యుండియును దాల్తు వేలొకో యుష్ణరశ్మి
అకట! మఱచితి కాలకూటాగ్నితోడ
నుదయమొందంగ నెట్టులౌ నొండు విధము.

ఓహో! ఏమి! యీమలయపవనుఁడుఁగూడ నన్ను బాధించుచున్నాఁడే.

మ. అకటా! న్యాయమె గంధవాహ ననుని ట్లారాటముంబెట్ట మా
మకవజ్రాభిహతోరుపక్షమలయక్ష్మాధ్రంబు నీకిప్డు బా
యక తోడయ్యెనొ నన్నెఱుంగదొ? యహల్యాస్నిగ్ధవక్షోరుహ
ప్రకటశ్రీవిజితాత్మ్రగా నవియె నాప్రాపంచు లోనెంచదో.

గీ. శైత్యమాంద్యసౌరభ్యముల్ చాలగలవ
టంచ్రు మలయజ! నీకు సత్యంబె తలఁప

నిను భుజింపఁగఁ బాము గ్రక్కును విషంబు
ఫలము జూచినఁ దెలియదే నస్తుగుణము.

ఆహా! ఆజవ్వనిలేని యీవైభవసామగ్రి యేల నాకు?

సీ. పడతి సింగారంపునడలచే గ్రాలని
భవనంబు లివి యేల పదవు లేల
సుదతియొయ్యారంపు చూడ్కులఁ గనలేని
దర్పణంబు లివేల దర్పమేల
తనుమధ్య గై సేసి తాల్చని యుపవన
సూనంబు లివియేల సొగసు లేల
చంద్రాననాస్మేరచంద్రికల్ గాయని
విరిపాన్పు లివియేల విభవమేల

గీ. సరసవాణిమృదూక్తులఁ గఱవనట్టి
శుకపికంబు లివేల శారికలు నేల
విచికిలామోద కౌఁగిటఁ బెనఁగకున్న
తను విదేల యనంగమంతనములేల.

(పరికించిచూచి) ఆహా ఆసుదతిరూపము కన్నులకుఁ గట్టిన ట్లుండి యెచటఁ జూచినను గాన్పించుచున్నది. నిజముగా నొకవేళ యిచటికి వచ్చినదేమో. అదిగో! ఆ స్తంభము చాటుననుండి తొంగిచూచి యహల్యవెంటనే యంతర్థానమైనది. ఏమిసేయుదు. అక్కడ దాగియున్నదేమో చూచెదగాక. (పోయి చూచు చున్నాఁడు.) అకటా! ఇక్కడను లేదే. ఇప్పుడు వచ్చియుండుట ప్రత్యక్షముగాఁ జూచి యున్నాను. ఇంతలో నెచటికిఁ బోఁ గలదు. శచీదేవిగాని యామెచెలికత్తెలుగాని దాచియుందురేమో. కనుగొనెదగాక. అహల్యా, అహల్యా, (అని పిలిచి) అయ్యో శచీదేవిని బిలుచుటకు మాఱుగా నహల్యను బిలుచుచుంటినే. ఎవరైన విన్నచో—

(శచీదేవి ప్రవేశించి ప్రణమిల్లును.)

శచీ:—నాథా! అహల్య నెప్పుడు తెచ్చితిరి? ఆమెరూపము గాంచి ధన్యురాల నయ్యెదను.

ఇంద్రు:—ఏమీ, నామనసు వ్యాకులముగా నున్నపు డేలయీపరిహాసములు? ఆసుందరి నెచట డాచితివో తక్షణము చెప్పుము. ఇప్పుడిటకు వచ్చియుంట ప్రత్యక్షముగాఁ జూచితిని. నీవో నీచెలికత్తెలో దాచియుండుట నిశ్చయము.

శచి:—ప్రాణేశ్వరా! నేనావృత్తాంతమేమియు నెఱుఁగను. అహల్యయని మీరుగొంతెత్తి పిలుచుటచేత నామె నిటకుఁ దెచ్చితిరేమో యని చూడవచ్చితిని. ఆమె గానరాకుంటయే గాక మీయుపోహములకుఁ గూడ పాలైతిని. నాచెలికత్తెలఁ గూడ నరసివచ్చెదను. (అని పోయి తిరిగి ప్రవేశించి) నాథా వారుఁగూడ నేమియు నెఱుఁగ మనుచున్నారు.

ఇంద్రు:—అటులైన మీరందఱు నాయంతిపురివిడిచి పొండు. తిరిగి యాజ్ఞసేయువఱ కిట కెవ్వరును రాఁజనదు.

శచీ—హృదయేశ్వరా! ఏల యీనిర్దోషులపై నింతకోపము? మీయాజ్ఞయెట్లో యట్లే యయ్యెడుగాక. కాని యీదీనురాలి విన్నపము కొంచె మాలింపుఁడు.

సీ. కాలకూటవిషాగ్ని కబళింపఁగా వచ్చు
బడబాగ్నిమంటలోఁ బడగవచ్చు
తీవ్రమౌ నసిధారఁ దిరుగంగ వచ్చును
మున్నీఁటిలోఁ బడి మునుఁగవచ్చు
సలసలఁగాగు నుజ్వలతైలముల దూఁక
వచ్చు ఘోరార్తుల బడయవచ్చు
వెన్నునిచక్రింపు వేడికోర్వఁగవచ్చు
శూలినేత్రాగ్నులఁ జొరఁగవచ్చు

గీ. గాని మునిజనపరిభవగ్లానిశాప
చండదహనార్చు లేర్చిన సాక్ష్య మగున
కలియుఁగా వంశనిర్మూలనకు మగుచ
విప్రశాపోప మాపింపఁ దీవరింప.

ఇంద్రు—సరే. అసంగతి మాకంటె నీకెక్కువ తెలియదా నీవు పొమ్ము.

శచి—చిత్తము. (పరిణమిల్లి నిష్క్రమించును.)

ఇంద్రు—నాకైన నాడు బ్రహ్మసభలో ననురాగపూర్ణదృష్టులఁ బఱపిన యహల్య నేఁడిట్లు నిరాకరించుటకుఁ గారణ మేమైయుండును? అగాతముఁజేదో మనోవ్యథ గావించి యుండనోవు. ఇఁక సామవాక్యంబులచే లాభమున్నట్లు గాన్పించదు. ఏదో మాయోపాయముచే మనోరథ మీడేర్చుకొనవలసియున్నది. గౌతముఁడు మంత్రోపాయముచేతనే గదా వివాహముచేసికొన్నాఁడు. అది యెంత యుచితమో యదియు నట్లే. కాని యేయుపాయ మవలంబింతును? (ఆలోచనమభినయించి) ఆ! సరే, అట్లుచేసెదను. నాకామరూపత్వ మిప్పుడు సదా సార్థకమగును. కాని శుద్ధమగు కుక్కుటరూపము దాల్చినా యనిమాత్రము సందేహముగలుఁగుచున్నది. ఏల సందేహింపవలెను? క్రియాఫలసిద్ధికి సాధనములయోగ్యతాయోగ్యతలతో నిమిత్తములేదు. ఫలదాయకమెయ్యదియో యయ్యదియే యోగ్యసాధనము.

గీ. ప్రబలరోగ మొకలిని బట్టియుండ
వైద్యుఁ డెవ్వ డనుశంకతోఁ బనియుఁ జేమి
గుణము నీయగ మంత్రైన గూటి మైన
మైన నేమిటికగు రోగి కరసి చూడ.

(నిష్క్రమించుచున్నాఁడు.)



శ్రీ

# అహల్యా శాపవిమోచనము.

## చతుర్థాంకము.

### రంగము. ౩

(గౌతమాశ్రమపర్ణశాల)

గౌతముఁడు—(తలుపు తెఱచిచూచి) అహల్యా, కోడి కూసినది. తెల్లవాఱు జామైనది. నేనేఁటికిఁ బోవలసి యున్నది. జపపరికరం బులు దెమ్ము.

అహ—ఇదిగో. తెచ్చితిని (అని కృష్ణాజినము, కమండలువు జపతా వళము నిచ్చును.)

గౌత—(పుచ్చుకొని) అహల్యా, ప్రతిదినము నాకంటె ముందు లేచియుండెడిదానవు. నేడు నేనే నిన్ను లేపితిని శరీరమందేమయి న బద్ధకముగా నున్నదా యేమి? మఱికొంచెముసేపు విశ్రమింపుము.

అహ—నాథా. ఇఁక విశ్రమింపనక్కఱలేదు. నేడేమో కలఁతనిద్దుర యయి దుస్స్వప్నములు వచ్చినవి. రాత్రి పొద్దుపోవుదనుక మీ పాదసేవ సేయుచు మీవలనఁ బతివ్రతామహాత్మ్యములు జీవేశ్వ రస్వరూపవివరణము మున్నగుగాథలు వినుచున్న నాకు, నొకగం ట యయినను నిద్రించితినో లేదో యింతలో నిట్టిదుస్స్వప్నము లేల కలుఁగవలె నని భీతి పొడముచున్నది.

గౌత—(మీఁదచేయివైచి తట్టుచు) ఓముగ్ధురాలా! భీతి జెందకుము. ఆస్వప్న మేదో చెప్పుము. స్వప్నమని తెలిసినతరువాతఁ గూడ భయమెందులకు?

అహ—ఎవరో యొకదివ్యపురుషుఁడు వచ్చి నన్నుఁ జేయిపట్టి లాగుకొనిపోయి యొకకొండగుహాలో ద్రోచి పైన ఱాతి నొకదానిని మూసి యరిగినట్లును నేనాక్రందన మొనర్చుచుండ మీరు వచ్చి యాఱాతిని దొలఁగించినట్లును గలవచ్చినది. అంతలో మీపిలుపు విని మెలఁకువ వచ్చినది.



గౌత—సరే ఇంతేగద. ఇఁక నేను నిలుచుటకు వీలులేదు. అనుష్ఠానవేళ యయినది. తిరిగి వచ్చి యీస్వప్నమునకు ఫలము సావకాశముగా నుడివెదను. నీవు భీతిని విడిచి జాగరూకతతో నుండుము.

అహ—మహాప్రసాదము. మీపాదస్మరణచే నాకేభీతియుఁ గలుఁగదు. (అని ప్రణమిల్లును)

(గౌతముఁడు నిష్క్రమింపగా నహల్య తలుపులు వేసికొనును)

ఇంద్రుఁడు—(ప్రవేశించి)

భుజంగప్రయాతము. సురేంద్రుండనై యుండి చోరుండువోలెన్
జరింపంగ నయ్యెన్ నిశన్ మౌనిపంచన్
వరారోహ చేకూఱుభాగ్యంబు గల్గన్
దరిన్ జేరి కష్టంబు ధన్యుండ నౌదున్.

అహో! ఇప్పటికి నాయాశాలత ఫలమొసంగుతరుణము సంప్రాప్తించినది. ఇఁక నాలస్యము చేయరాదు. గౌతముఁడిక నొకజాములో రాఁగలఁడు. ఇపుడు నన్నీ యింద్రరూపమున నహల్య దరికి రానీయదు. కావున గౌతమవేషము వేయవలసి యున్నది. శస్త్రవైద్యునకువలె ప్రతిక్షణమెంత యోవిలువగలదై యున్నది. కావున నేను వెంటనే పోయి మగుడి వచ్చెదను. అహల్య మెలఁకువతో నుండుటకై తలుపుగ్రుద్ది పోయెదను.

(అని నిష్క్రమించును.)

అహ—(తలుపుతెఱచివచ్చి) ఎవరో తలుపు తట్టినట్లాయెను. ఎవరును గానరారే. ఇక్కవాటము మరుదాకృష్టమై యట్లు ధ్వనించెనేమో. నేఁడు నామనను గలఁత జెందినట్లే యీరాత్రి హిమమారుతమువలన నాశ్రమమందలి తరుగుల్మలతాదులును, ద్వారకవాటములును గంపించుచున్నవి. ఎంతఁ గంపించినను మానవులవలె శీతాతపంబులకు బాధ చెందవట. ఈవిషయములో మానవజన్మముకంటె స్థావరజన్మమే మేలుగ గాన్పించుచున్నది. ఎంతసేపటికిని దెల్లవారకున్నది. ఉదయభాస్కరుని దర్శన మెంతకాలమున కగునో తెలియకున్నది. ఇఁక లోనికిఁ బోయి తలుపు వేసికొందును. (అని తలుపులు వేసికొనును)

ఇంద్రు—(గౌతమవేషముతో బ్రవేశించి) సరిగా నున్నదా మునివేషము? ఎక్కడనైన దొరకిపోదునా? ముఖమునకు గడ్డము మీసము జటాజూటము వక్షమున రుద్రాక్షమాలికయు, చేత గమండలువు దండమును జపమాలయు గృష్ణాజినమును; బాహ్యమున మునివేషము వేయుట యేమికష్టము? ఇఁక నహల్య విడిచిపోవుచున్నను బోదు. ఎల్లప్పుడొకరీతిగ నుందునా?

చ. తనచిత్తవృత్తులవిధం బొకరీతిగ నెంచనౌనె యెవ్వరిని బ్రశంసించుచుఁ దోకపట్టున వారినె యొంచువేళ నాదరణ మొసఁగు రిచ్చమెయి దాల్ప ప్రియంబగు వేషభాషలన్ సురుగక నిల్చి లేఁచి మనసున్ గ్రహియింప సుఖంబుచేకుఱున్.

ఇఁకఁ దడయరాదు. అహల్యను బిల్చెదను. వేషము సరిగా నున్నదా (అని తిరిగి చూచుకొని) అహల్యా, అహల్యా, (అని తలుపు తట్టుచున్నాఁడు.)

అహ—(తలుపు తెఱచి ప్రవేశించి) నాథా, నమస్కారము. నేఁడేమి యింత త్వరితంబున వచ్చితిరి? ప్రతిదినమువలె నొడల విభూతి

చాల్పతే దేమి?

(అనిజపపరికరముల నందుకొని లోపలబెట్టును.)

ఇంద్రు—అన్నా! తగినుఱచిపోయి చిక్కు పెట్టుకొంటిని. అను మానము కలిగెనేని యత్నమంతయు వృథా యగును. కాక ప్రాప్తమెట్లున్నదో, యిట్లనెదను.

అహ—ఏమి యాలోచించుచుంటిరి. నాకుఁ జెప్పఁగూడని రహస్య మేమైనఁ గలదా?

ఇంద్రు—ప్రేయసీ. నీకుఁ జెప్పఁగూడని రహస్యము లేదుం—(నాలుక కఱచుకొని) గౌతమునికి నెన్నఁటైన నుండునా? నిజము చెప్పిన నీవేమనుకొనెదవో యని సంశయించుచున్నాఁడను. అంతియ కాని వేఱు కాదు.

అహ—ఏమట్లు సంశయముతో మాటలు తడఁబడుచు మాట్లాడుచున్నారేల? యథాస్థితి నెఱిఁగింపుఁడు.

ఇంద్రు—(తనలో) కనిపెట్టినదా ఏమి చెప్పుదును. తగిన మర్యాదగా దాఁటిన బాగుండునేమో!

అహ—త్రికరణశుద్ధిగా మిమ్మే చిత్తవృత్తి ననుసరించు నీ సేవకురాలి యెడల ననుమానమెందులకు?

ఇంద్రు:—(తనలో) ఓహో! ఏమి యమృతంపువాక్యములు? అహల్యచే నేనిట్లు గౌరవింపఁబడుదునని యెన్నఁడు ననుకొనలేదు. తుహాక్యాపరణచే నాపదసకష్టము నయము మఱలి పోవునది. కాని నేనింద్రుఁడ నని తెలిసికొని యనినచో నానందసముద్రమే! (ప్రకాశముగా) ప్రాణేశ్వరీ! చెప్పెద వినుము. బ్రహ్మసృష్టిలో ని దివఱకెన్నఁడును లేని చక్కఁదనమును వహించిన నీరూపము సదా స్మరణకుఁ దెచ్చి మాకనుష్ఠానములకు విఘ్నము కల్గించినది. నా జ్ఞానసంపత్తిచే చిత్తమెంత స్థిరపఱపఁ జూచినను సాధ్యపడలేదు.

"బలవానిన్ద్రియగ్రామోవిద్వాంసమపికర్షతి" అను నార్యోక్తి
మృషయగునా?.

అహ:—(సిగ్గు నభినయించును.)

ఇంద్రు:—సుందరీమణీ! ఏల సిగ్గుపడెదవు? నీసిగ్గుచే నీసౌందర్య
శోభ ద్విగుణితమై ప్రకాశించుచున్నది. ఇంకఁ బెక్కుమాటలేల?
పంచశరుబారిచే వంచితుండనై యనుష్ఠానంబులెట్టులో ముగించి
సత్వరంబున బలాయితుండనై నిన్నిపుడు జూతునా యని వచ్చి
తిని. ఇంకఁ దెల్లవాఱుసమయము కావచ్చుచున్నది. తడయక
కేళీగృహము చేరుదము రమ్ము (అని చేయిపట్టి లాగుచున్నాఁడు.)

అహ:—(సిగ్గుచేఁ దలవంచుకొని చేయివెనుకకు లాగుచు) ఏమిఁ,
ప్రాణేశ్వరా! ఇట్టి సంధ్యాసమయముల నెన్నఁడిట్టిశృంగారచేష్ట
లఁ దలపెట్టని వారేల యిప్పుడిట్లు బల్కుచున్నారు? నామనం
బరయఁ గోరి యానుచుంటిరా? త్రికరణశుద్ధిగ ధర్మార్థకామమో
క్షంబుల మిమ్మనుసరించుదాననేకాని వేఱుగాదు. ఏల యీ
తొందర? పూర్వము దితి యిట్టి సంధ్యాసమయముననే కశ్యప
మహర్షిని మోమోటబెట్టి కవయుటచే లోకకంటకులగు హిర
ణ్యాక్షహిరణ్యకశిపులుద్భవిల్లి రని మీరే కదా చెప్పి
యున్నారు. మీకుఁ దెలియని ధర్మములు గలవా?

ఇంద్రు:—అహల్యా! ఏల యిట్టిశంకలచేఁ దడవొనరించెదవు? ఇం
కను సంధ్యాసమయము కాలేదు. పొద్దు లెక్కపెట్టిచూచితిని.
రమ్ము పోవుదము. (అని చేయిపట్టి తీసికొనిపోవుచుఁ దనలో)
సంతోషము పూర్ణముగానుండక యమాయికయగు నిత్తరుణీమ
ణిని వంచించుచుంటినను వ్యసనముకూడ నొకప్రక్క మెలిమెలి
లాగుచున్నది. కాలక్రమమున నానిజరూపము చూపి యొడంబ
ఱచినపిదప సంతోషము పూర్ణమయి యానందబాష్పముల నహ

స్త్రివిధంబుల విహునసేర్తును.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

గౌత:—(ప్రవేశించి) నేఁడేలకో శిష్యసంతతి తెల్లవాఱుజామున పాఠములు వల్లెవేయుట వినరాకున్నది. ఈదూరమున నుండగనే యహల్య యెదురు వచ్చి జపసరికరంబులు బుచ్చుకొనుచుండెడి ది. నేఁడట్లు రాకుండెను. అంతియకాక యీపాటికి తెలతెలవా ఱుచుండెడిది. ఇంకను నేఁడీచీఁకటియేమి ?(అనిఆకసముపరికించి) ఓహో! ఇంకను జాముగాత్రి యున్నదే. నేను నడిరేయి లేచి యుందును. కోడికూఁత విని లేచితిని. కోడి యప్పుడేల కూసిన ది? (అని ఆలోచించి) ఆ! ఎంత మోసము! ఎంత మోసము! (రోషముతో)

ఉ. ఎవ్వఁడవోరి! ఘోరతరకృత్యమొనర్చితి నస్మదాశ్రమం
బివ్విధిఁజొచ్చి లజ్జత్యజియింపుచు తుద్రిపుగుక్కుటంబవై
క్రొవ్వునఁ గొక్కొరో యనుచు గూసితకాలమునం దహల్యతో
నెవ్వగలేక కూడెద వరే! నిను భస్మ మొనర్తు బాలిశా.

(అని జపమాల క్రిందవేసికొట్టి వడివడిగానడిచి తలుపుతట్టి)

అహల్యా, అహల్యాఁ ఓసిపాపీ, వ్యభిచారిణీ, తలుపుతీయవేమే!

గీ. ఓసి, చండాలురాల నీయుద్యమంబు
సర్వమును మాకుఁ దెలిసె నస్మత్కఠోర
చటులరోషాగ్నికీలకు శలభములుగ
వేగ మిము జేసెదను జత వీడకుండ.

మ. ఘటవార్ధిప్రభవోగ్రహాలహాలసంకాశప్రచండంబు, ను
త్కటవర్ధప్రళయానిలాభము జగత్ క్షోభ్యప్రభావంబు, ది
క్కటనాథప్రకరప్రకంపితమహాధైర్యంబవార్యంబు, మ
చ్చటులక్రోధరసం బెవండు చవిగాంచక్ గోరెనో మత్తుఁడై.

అహల్య:—(తలుపు తెఱచివచ్చి గౌతముని పాదములపైఁ బడి) నా
థా, రక్షింపుము, రక్షింపుము, మీపాదసేవకన్న నే నేమియు
నెఱుఁగనిదానను. లోపల నొకమూర్తియు బైట నొకమూర్తి
యు దాల్చిన మిము జూచి నాకు దిగ్భ్రమకలిగి నోట మాటరా
కున్నది. మీమాహాత్మ్యము మందబుద్ధినగు నేనా కనుఁగొనుట
రక్షింపుము.

గౌత—(అహల్యనెడమకాలఁదన్నుచు) ఓసీ, పుంశ్చలీ, ఇంకను గప
టస్నేహములు సక్కవినయములు ప్రకటించెదవేల? తప్పించుకొ
ను నుపాయము లేక లోపల నున్న నీప్రియునకు నాకూపము
కల్పించి యిది యొకయంత్రము పన్నుచుంటివే? ఇంకను నీపతి
వ్రతాత్వమెక్కడ? "భార్యారూపవతీశత్రుః" అను లోకోక్తి
నాయెడ నిజముచేసితివి. ఇప్పుడు నీయెదుటనే నీప్రియుఁడెవఁడో
వానినోటనే పలికించెదఁ జూడుము. (అగలోపలికిఁజూచి) ఓరీ,
ఎవ్వఁడవురా నీవు? ఇంతలో మార్జాలరూపము గైకొంటివి? నీనిజ
రూపముతో నీవలకురమ్ము.

(అని మంత్రజలంబులఁ జల్లుచున్నాఁడు)

ఇంద్రు—(నిజరూపముతో వచ్చి గౌతముని పాదములపైఁ బడి) అప
రాధిని. అపరాధిని, రక్షింపుము, రక్షింపుము.

అహ—ఓరీ, చండాలుఁడా, ఇంద్ర, నీవేనా? (అని మూర్ఛిల్లుచున్నది)

గౌత—

స్రగ్ధర. ఓరీ దుర్మార్గవర్తీ! మొదలు తెలియ కిట్లుర్విఁగామప్రవృత్తిన్
వీరత్వం బూని స్వేచ్ఛన్ దిరుగుచొరుల బాధింపఁగా శక్ర నీ
స్వారాజ్యాధీశ్వరత్వప్రకటపదవి నాపద్మజుండిచ్చె నింకన్
సీరంధ్రాసహ్యరంధ్రాన్వితతనువెసగన్ నీవునర్తింతుగాతన్.
నీశరీరమంతయు దూట్లుపడి చూడ దుస్సహంబయి యుండు

గాక. పొమ్ము (అనిమంత్రజలంబులజల్లును)

(ఇందుఁడునిష్క్రమించును)

(గౌతముఁడహల్యంజూచి) ఓసీ, చండాలురాలా?

శా. ఓసీదుర్మతి, యెట్లోడంబడితి పీవూహింపకుండఁగ నీ
దోషాపాదకవృత్తి కేను వపమందు న్నిష్ఠమైనుండఁ; నా
తోశుద్ధాత్మకవోలె కైతవపుభర్తన్ జూపగా నేర్చె! నీ
చా? సిగ్గేలాగాలేదె? తత్క్షణము పాషాణంబవై పోవుమా.

అహ—హా! హా! నాథా, శాంతింపుము శాంతింపుము నాదోషమే
మియో సరిగాఁ బరిశీలింపవైతివి. నీరూపముతోనున్న యాద్రో
హి నెట్లు గుర్తింపఁ గలను? నేను భావనచే గాని కంటి యెదుట
గాని నీరూపముగాక యన్యునిరూపము జూచి యంగీకరించితినేని
మహాపాతకఫలం బనుభవింతుఁగాక.

గౌత—ఓసీ! పాపీ! నేనకాలంబున నిన్నెన్నఁడును గోరకుంట నీకుఁ
దెలియదా? అట్టిచో నట్టివిపరీతపుగోరికకుఁ గారణమేమై యుండు
నని దివ్యదృష్టిం జూడవలదా? నీకు దివ్యదృష్టిజ్ఞాన మొసంగిన
దెందులకు? నీకుఁ గూడ నిష్టముండుటచేతనే యట్టిదుష్కార్యము
న కొడంబడితివి.

అహ—శివశివా! ఏల యీశూలపుపోట్లు? త్వరగాఁ బాషాణజన్మ
డయసేయుము. అక్కటా! నానిర్దోషత నీమనసునకుఁ దట్టినచో
నెట్టిశిక్షనైనను సంతోషముతో ననుభవింతును గదా, నాథా!
వేయేల? పాషాణజన్మము గాదు ఇసుకరేణువులుగా శపించిన న
నుభవింతును గాని నీయాజ్ఞ నెఱవేర్పక నీవృత్తి సంశయించుచు
దివ్యదృష్టిచేఁ బరిశీలించునంతటి మహాపాతక మీదాసురాలొ
నర్చునని యెన్నఁడును దలఁపవలదు. ఏమిసేయుదును. నానాథు
నకింకను నమ్మకమురాకున్నది. ఓపంచమహాభూతములారా! ఓ

చంద్రసూర్యాది దేవతలారా! ఏలనానిర్దోషత నానాథునకు బోధింపక మిన్నకుండెదరు? మీ రెఱిఁగిన యంశము చెప్పకుండెదరేని మిమ్ముల నిప్పుడే శపియించుదాన.

(ఆకాశవాణి)

ఓ గౌతమా! అహల్య నిర్దోషురాలు. అహల్య నిర్దోషురాలు. ఆమె చెప్పినది యథార్థము.

గౌత—ఆహా! అహల్యా, తొందరపడి శాపమిచ్చి నీయెడల గొప్ప యపచారము చేసితిని. కోపముచే మనసు కలఁతఁజెంది సత్యము స్ఫురించినది కాదు. నావచనం బమోఘము. అయిన నీశాపము నీకుఁ బ్రాయశ్చిత్తమాత్రకం బయ్యెడుఁ గాక. శునకసంపర్కము గల హోమపాత్రికం బోలె నీకుఁ బ్రాయశ్చిత్త మవసరమై యున్నది. కావునఁ గొంతకాలము శిలారూపంబున నుండి శీతాతపవర్షంబులచేఁ బరిశుద్ధభౌతిక దేహవై తిరిగి నిజరూపం బొంది నన్నుఁ బొందెదవుగాక.

అహ—నాకిప్పుడు పరమసంతోషముగా నున్నది. నానిర్దోషత వెల్లడి యైనది. తిరిగి తమపాదదర్శన మెప్పటికగును మహానుభావా?

గౌ—ఒకవేయివత్సరంబులకు శ్రీమహావిష్ణువు మనుష్యావతారగంధుఁడై కొండొకకారణంబున నీమార్గంబునఁ జనుచుండ నామహానీయుని పాదరజంబు సోకి శిలాజన్మమువాసి పవిత్రత బొంది మానవజన్మము గాంతువు.

అహ—ధన్యురాలను. ధన్యురాలను. ఇఁక శాపమొసంగుఁడు.

గౌత—(మంత్రిజలముచల్లును, అహల్యశిలయైపోవును) (ఇంద్రుఁడును శచియుఁ దిరిగిప్రవేశించి గౌతముని పాదములపైఁ బడుదురు.

శచి—మహానుభావా, రక్షింపుము. పతిభిక్ష పెట్టుము.

గౌత—ఏమమ్మా, నీకు మాంగళ్యలోపము రానీయ లేదే. నీపతి జీ

వితంబున కేమిభయము?

శచి—అట్లుకాదు. నీవలన పొందిన శాపముచేఁ గురూపినై యెవరి మొగము చూడక నొల్లక యుసురులఁ దొఱగెద ననుచున్నాఁడు. నన్నుజూచిమైనగరుణించియీపురందరునకీచిక్కుఁ తొలఁగింపుము

గౌత—అమ్మా! చేసేతఁ దెచ్చుకొన్న చిక్కు లనుభవింపక తప్పు నా? నాకెంతయో తపోవ్యయమైనది. పండువంటి సంసారము చెడినది. ఇఁక వీఁ డేమైపోయిన నాకేమి?

శచి—గౌతమా! అట్లుకాదు. విప్రునకు దీర్ఘకోపముండరాదు. నీవు తిరిగి శాంతచిత్తతతోఁ దపస్సాచరించిన నీయెప్పటితపోబలము బడయఁగలవు. అహల్యయు శాపవిముక్తి నొంది నిన్నుబడయగలదు. అట్టిచో నాకుఁబతిభిక్షనొసంగవా?

గౌత—అమ్మా! మంచిది. మహాపతివ్రతవైన నీకోర్కె కొంతవఱకైనఁ దీర్పక తప్పదు. ఈతని శరీరమందున్నరంధ్రము లక్షులవలె గాన్పించుచు నింతటనుండి సహస్రాక్షుఁడను నామముతో నీపతిబఱఁగుఁగాత. మీరింకఁబొండు. మఱియు నింతటినుండి మా యురూపముచే నెవ్వఁడైన స్త్రీనిబొందయత్నించినచో సంగమకాలంబున వానికి నిజరూపము వచ్చుఁగాక. లోకమం దిట్టిమోసములు నశించుఁగాక.

శచీపురందరులు—మహాప్రసాదము (అనినిష్క్రమించుచున్నారు.)

గౌత—అకటా! అహల్యలేని యీయాశ్రమంబున నేనెట్లు నిలువగలను?

సీ. వేకువఁ నాజపవిధికిఁ గావలసిన
పరికరంబిఁక నిచ్చువారలెవరు
అతిథియభ్యాగతులరుదేర ముదముతో
నాదరించెడువార లరయ నెవరు

తాపమార్చుటకు నోర్పుగా జాలకేతెంచు
బీదలకన్నంబు పెట్టునెవరు
శ్రమజెంది యున్నచో సంగీతముఁ బాడి
చిత్తము రంజిల్ల జేయు నెవరు
గీ. గృహము కేఁ దెచ్చు సామగ్రి యిమ్ముజేసి
సర్వసౌఖ్యంబు లొనఁగూర్పఁ జాలునెవరు
స్త్రీలతో నింటికేతెంచు స్నేహితులను
నిండుగౌరవమీయఁ దోడుండు నెవరు.

ఆహా, అహల్యలేని యీయాశ్రమ మెట్లుచిన్నవోయెనుగదా!
ఉ. సోముఁడు లేని రాత్రి విరిశోభ దలిర్పని శయ్య వారిజ
స్తోమము లేని పెన్గొలను సూర్యుఁడు లేని నభంబు నాయకం
బౌమణి లేని హారము నిజాత్మతొలంగిన దేహమాను కాం
తామణి లేని యీగృహమునన్ వసియించుట నాకు శక్యమే.

కావున నహల్య వచ్చువఱకు నాచేఁ బ్రవహింపఁ జేయఁబడి న గోదావరీతీరంబునఁ గోటిలింగక్షేత్రమునఁ జపము గావించుకొనుచుండెదను.

(అనినిష్క్రమించుచున్నాఁడు.)



శ్రీ

# అహల్యాశాపవిమోచనము.

## పంచమాంకము.

---

రంగము ౧—సిద్ధాశ్రమప్రాంతాటవి.

(మారీచసుబాహులు ప్రవేశించుచున్నారు.)

మారీ:—ఓరీ సుబాహూ, ఎక్కడను ఋషులయాశ్రమములలో యజ్ఞయాగాదులు జరుగకుండఁ జేయవలసినదని మన ప్రభువైన రావణాసురుని యాజ్ఞగదా. అదిసరిగా నెఱవేఱుచున్నదా? ఇంక నెవ్వరైన నేమూలనైనఁ గ్రతువులు సాగించుచున్నారా?

సుబా:—ఎవ్వరును జేయుచున్నట్లగపడదు. మనరాక్షసబలంబప్రమత్తతతోఁబనిచేయుచున్నది. అత్రిచేయుయజ్ఞము అడుగంటినది. భరద్వాజునిక్రతువు భగ్నమైనది. జాబాలిసవనము ఛిన్నమైనది. విశ్వామిత్రునియాగము విఫలమైనది. కాని అన్నయ్యా! నాకొక సందేహమున్నది చెప్పుము. మనతో సమానులతోఁ బోరాడవలెను గాని యాఱునెలలు సాముచేసి మూలనున్న ముసలిముండను కొట్టినట్లు నోరువాయిలేని ఋషులతో మనకీ వివాదమేటికి? ఈ యజ్ఞములు పాడుచేయుటవలన మనకేమి లాభము?

మారీ:—ఓరి అల్పాయుష్యపుముండాకొడుకా! నీకుఁగూడ నిట్టియల్పాయుష్యపుటూహలు తోఁచుచున్నవా? మనలో నిర్భాగ్యుఁడు విభీషణుఁడొక్కఁడే యిట్టియూహలు గలవాఁడనుకొన్నాను. నీవుకూడఁ దోడున్నావా? ఇన్నాళ్ళనుండి యజ్ఞములు పాడుచేయుచున్నాము. దానికర్థమేమో నీకుఁ దెలియనే లేదా? మనరాక్షసకులమునకు వైరి విష్ణువన్నమాట యెఱుఁగుదువు గదా. వా

నికోస మెన్ని ప్రయత్నములు చేసినను దొరుకుటలేదు. ఈయ
జ్ఞాదులలో నడఁగియుండునఁట. కనుక యివిపాడుచేసినచో వాని
కిఁ దగిన గర్వపాయశ్చిత్తమై బయటబడునఁట.

సుబా:—ఓహో! అదా? ఏమి ప్రాయశ్చిత్తమవును? మొన్న నే
విశ్వామిత్రునియజ్ఞము కడవలతో నెత్తురుమాంసంబులు హోమ
కుండంబునఁ గురిపించి ధ్వంసముచేసితిమి. ఎవరును గాన్పింప
లేదు. విశ్వామిత్రుండు బహుకోపిష్ఠి యని వాడుక. ఏమియుఁ
జేయలేక చూచుచు గూర్చున్నాఁడు. వానిప్రాయశ్చిత్తమువరా
త్రేమయినది.

మారీ:—అప్పుడే యేమయినది. ఎవ్వరినో రాజులను మనతోఁ యు
ద్ధముచేయుటకై తీసికొనివచ్చునఁట. అయోధ్యాపురపురాజును
సహాయము చేయుమని కోరుటకు వెళ్ళినాఁడఁట. ఈసంగతి మన
వాఁడొకఁడు మునివేషముతోఁబోయి వినివచ్చి నాతోఁ జెప్పి
నాఁడు.

సుబా:-—అహ్హా, హ్హా,హ్హా (అని వికటముగా నవ్వి) ఒరే అన్నయ్యా!
నీమాటలు వినగా నాకు నవ్వు వచ్చుచున్నది. ఈపిచ్చిముండా
కొడుకు మనము నరభోజనులమన్న మాట మఱచినాఁడా యేమి?
నరులను యుద్ధమునకుఁ దీసికొనివచ్చిన నేమిప్రయోజన మను
కొన్నాఁడు. మన మొక్కొకబుక్కకు మ్రింగివేయమా?

మారీ:—మ్రింగ్రవేయము.

సుబా:—ఎందుచేత?

మారీ:—ఎందుచేతనా మనతల్లి తాటక దారిలో నున్నదన్నసంగతి
మఱచితివా యేమి? ఆమె మనవఱకు రానిచ్చిన గదా మనము
మ్రింగుట?

సుబా—అవునురోయి. ఈసంగతి యామెతోఁ జెప్పి మనము సుఖ

కముగా నిక్కడ నిద్రపోవచ్చును.

మారీ—అట్లుచేయుదము. రా. పోవుదము. కాని యీమారైన తిరిగి విశ్వామిత్రుఁడు యజ్ఞము చేసిన నేమిచేసెదవురా?

సుబా—ఏమిచేసెదనో చూచెదవుగాని. ఒక్క హోమకుండమే గాక యజ్ఞశాల యంతయునుగూడ నెత్తురుమాంసములతో ముంచివేసి యీబుద్ధిలేని ఋషిముండకొడుకులను గాలుసేతులు విఱిచి కట్టి దానిలో బాఱవేయుదును.

మారీ—శబాస్. సాగెడుచోట బాగుగా నల్లరిచేయుటలో నీతరువాతనే యొకరిని జెప్పినను. కాని ప్రొద్దుపోవుచున్నది రమ్మా. మనయమ్మ నిద్రించు వేళ యగుచున్నది. నిద్రలో లేపితిమేని నొడలు తెలియక నిన్నును నన్నును గూడ మ్రింగును.

సుబా—అట్లయినఁ బోదము రమ్మా.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

---

పంచమాంకము. రంగము.—౨

అయోధ్యాపురము.

(దశరథుని కొలువు. దశరథుడు, సుమంత్రుఁడు వసిష్ఠుఁడు మఱికొందఱు పౌరులు కూర్చుండియున్నారు.)

దశ—సుమంత్రా, రాజ్యమెట్లున్నది? ప్రజలందఱు సుఖించుచున్నారా? లోపముల నేమైన నుగ్గడించుచున్నారా?

సుమం—మహారాజా?

సీ. వినుమనొల్లరు గదా విహితవర్ణాశ్రమవృత్తి
ధర్మంబుల పీనమైన

పఠయనొల్లరుగదా పరధనపరకాంత
లొలసి రక్షణ సేయుమందురిగాని
నాడనొల్లరుగదా యనృతవాక్యంబులఁ
బరిహాసమునకైనఁ బాపభీతి
హద్దుమీరరుగదా పెద్దలమాటకుఁ
గడలి యాచెలియలికట్టవోలె
గీ. ధర్మమెల్లెడ నాల్గుపాదముల వెలయ
పాడిపంటలు సిరులతోఁ బ్రబలి యుండి
సర్వసర్వంసహాప్రజల్ సౌఖ్యములను
గాంచుచున్నారు దశరథాత్మజలేంద్ర.

మఱియుఁ బ్రజలందఱు నేకకోరికతో నున్నట్లు తెలియ వచ్చినది.

దశ—అదేదో సత్వరంబున నెఱిగింపుము.

సుమం—

సీ. స్మితపూర్వభాషుండు చింతితకార్యుండు
చేరలమీఱు రాజీవనేత్రుఁ
డమలాంతరంగుండు నార్యవిధేయుండు
నాయతవక్షుఁడు నమలగళుఁడు
సర్వభూతసముండు సకలకళావేది
సకలకళాపూర్ణచంద్రముఖుఁడు
గర్వితరిపుమదఖండనశీలుండు
గరువంపుటేఁబోతు గతిగలాఁడు
గీ. అట్టి శ్రీరామభద్రుండు యౌవరాజ్య
పట్టభద్రుండు నయి తము పాలనంబు

సేయ నువ్విళులూరుచు జిత్తములను
గోరుచుండుట తెలిసెనో కువలయేశ.

దశ—అవును. అఱువదివేలయేండ్లనుండి యొకే విధముగా నున్న నాపరిపాలనతోఁ బ్రజలు విసిగి యుందురు. అంతియ కాక య ట్టికోరిక నాకునుం గలదు.

మ. చిరకాలంబుననుండి యీయినకులశ్రేయోభిదాయంబునై
పరిరక్షింపఁగ మద్భుజాస్థితమహాభారంబునై యొప్పు రా
జ్యరమన్ నందనుమూపునందిడుచు సంసారంబునందెంతయున్
విరతిన్ గాలముపుచ్చ పెన్నఁడని యువ్విళ్ళూరుదు న్నెమ్మదిన్.

సుమం—దేవా, శ్రీరామచంద్రునియందుఁ గలప్రేమచే ప్రజలట్లు తలఁచుచున్నారే కాని మీపాలనమందలి విసుగుచేఁ గాదు. ఇన్నాళ్ళనుండియు లేని విసు గిప్పుడెట్లువచ్చును?

దశ:—అమాత్యవరా, అట్లుకాదు. అవకాశము కలిగినప్పుడు గాని యంతఃకరణప్రవృత్తులలో భేదము పొడకట్టదు. ఇంటఁగుడిచి గూర్చుండిన వానిని సత్యవాక్యపరిపాలనా వ్రతుఁడనియు, బర ధనపరదారవిముఖుఁడనియు ననిన నేమిలాభము? తగినయవకా శ మబ్బినను దృఢవ్రతుఁ డగువానినే శ్లాఘింపవలసి యున్నది. ఆరీతినే ప్రజలకు నిదివరలోఁ బరిపాలనలో మార్పు జెందు నవ కాశము కల్గలేదు. ఇప్పుడు శ్రీరామచంద్రుని యావనప్రాదు ర్భావముచే నట్టి యూహ కలుఁగవచ్చునని తోఁచుచున్నది. అ యినను చిరంజీవియౌవరాజ్యపట్టాభిషేకము మనకందఱికిని గూ డ సంతోషదాయకమే గావునఁ బ్రజలకుఁ గలయీకోరికె వెం టనే తీర్పవలసినదే. కానిముందు వివాహమహోత్సవమాచరిం చి తరువాత నీయుత్సవము జరిగించిన బాగుగ నుండునేమో య ని తలఁచెదను. ఏమి గురువరా, మీ యభిప్రాయమేమి? (అని

వసిష్ఠునివంకజూచును.)

వసి:—అది సమంజసముగనే యున్నది. (అపవారించి) దశరథా. కొంత రాజ్యభారముతోఁ బాటు కొంతసంసారభారముకూడ శ్రీ రామచంద్రునిపై దోఁయ యత్నించుచుంటివా? అతనిశక్తి యె ట్టిదనుకొనుచుంటివి? ఇట్టివనంతములగు రాజ్యములను సంసార ములను వహింపఁగల దివ్యతేజముగలవానినిగా నెఱుంగుము.

దశ:—(నవ్వుచు) మీ యాశీర్వచనప్రభావము.

ద్వా:—(ప్రవేశించి) మహాప్రభో, ఎవరో మహర్షి విశ్వామిత్రు లవారఁట. మీదర్శనము వెంటనే కావలెనని వచ్చినారు.

దశ:—విశ్వామిత్రభగవానులే. పూజాద్రవ్యంబుల వెంటనే తెమ్ము (అని లేవబోవుచున్నాఁడు)

వసి:—రాజా! నీవు లేవవలదు. నాచిరకాలమిత్రుని విశ్వామిత్రుని నేనే స్వయముగఁ బోయి యెదుర్కొని తీసికొని వచ్చెదను. (అని నిష్క్రమించి తిరుగ విశ్వామిత్రునితోఁ బ్రవేశించును.)

(సభలోని వారందఱు లేచినిలుతురు)

దశ:—ఋషిపుంగవా, నమస్కారము.

విశ్వా:—సర్వకళ్యాణసిద్ధిరస్తు.

దశ:—స్వామీ! ఆసనమలంకరింపుఁడు.

(విశ్వామిత్రుఁడుకూర్చుండగా నందఱును కూర్చుండుదురు.)

ద్వా:—మహాప్రభో, పూజాద్రవ్యంబు లివిగో

దశ:—(పుచ్చుకొని విశ్వామిత్రునకెదురుగ నిలుచుండును)

విశ్వా:—రాజచంద్రమా, మేము వచ్చిన పని కాకుండ నీయతిథి సత్కారంబుల ముందుగ స్వీకరింప నొల్లము నీవు కూర్చుండుము నేను చెప్పెడి యంశముల ముందుగ గమనింపుము.

దశ—(కూర్చుండి) స్వామీ, ఈరాజ్యమంతయును నేనును నాకు

టుంబమును మీవారలమై యున్నప్పుడట్లు శంకించెద రేల? మీ రేది సెలవిచ్చిన నది చేయువాఁడనే కాని తప్పువాఁడను గాను. ఆతిథ్యము గ్రహింపుఁడు.

విశ్వా:—రాజా, నీవచనామృతము చేతనే నాకు సంపూర్ణాతిథ్య మొసంగితివి. ఇంతకంటె బ్రస్తుతము వేఱాతిథ్యమక్కఱలేదు. నాకోరెడునది తప్పక యిచ్చెద నంటివి. ఆహా రాజనునప్పుడు నీవేరాజవు. నీకంటె నుత్తముఁ డీలోకమున నెవ్వఁడును లేఁడు. సూర్యవంశంబును బుట్టిన వాఁడవు వేఱెట్లు పలుకుదువు? సత్యసంధత యర్థిజనప్రియత్వము మీకనుగ్గుపాలతో వచ్చినవే కావా?

సుమం:—(తనలో) ఈవిశ్వామిత్రుఁడు ఋషులలో గడు నసాధ్యుఁడు ఏమి దుర్ఘటమగు కోరిక కోరునో తెలియదు. కానిమ్ము. అట్టిదుస్సాధ్యమగు కోరికనేదేనిఁ గోరిన మహాత్మ్యసం దీయనకుఁ దీసిపోని వసిష్ఠభగవానులవారిని సమాధానముచెప్పుటకుఁ గోరవచ్చును. (ప్రకాశముగా) స్వామీ, మీకోరిక యేదియో సెలవిచ్చి మమ్ము ధన్యులఁ జేయుఁడు.

విశ్వా:—ఇదిగో చెప్పెద రాజా సావధానముగ నాకర్ణింపుము. నేనొక క్రతువొనరింపవలసియున్నది. అయ్యది తలపెట్టినప్పుడెల్ల రక్కసులు వచ్చి రక్తధారలు హోమకుండంబునం బోసి ధ్వంసము చేయుచున్నారు. శపింప రాదా యందువేనిఁ గ్రోధమనస్కుఁడనైనచో యజ్ఞఫలములేదు. కావున నీకుమారులగు రామలక్ష్మణుల నాతోఁడఁబంపెదవేని వారలచే రాక్షసబాధయడఁగి సవనము యథావిధిగ జేసికొనువాఁడ సత్వరంబున నాతోఁడఁ బంపుము.

దశ:—రామలక్ష్మణులా! స్వామీ! రాక్షసబాధతప్పింతురా!

విశ్వా:—ఆ, ముమ్మాటికిని రామలక్ష్మణులే తప్పింతురు. ఏమిపం

పననేదవా?

దశ:—అదికాదు. మహానుభావులు మీకార్యము నెఱవేర్పకుందునా? ముక్కుపచ్చలారని యీనిసువులెక్కడ! రాక్షససంహార మెక్కడ! నాసైన్యమంతయుఁ దీసికొనిపోయి మీకార్యము నెఱవేర్చుకొనుఁడు. నన్ను రమ్మన్నను వచ్చెదను.

విశ్వా:—ఎదిరిశక్తి తెలియక మాటలాడుచున్నావు. రాక్షసులన సామాన్యులనుకొనుచుంటివా యేమి? లోకకంటకుఁడైన రావణాసురునియనుచరు లగుమారీచసుబాహులనెడు ఘోరరాక్షసులు కడు నసాధ్యులు. నీసైన్యము దైన్యమునొందును. దివ్యతేజులగు నీరామలక్ష్మణులచేఁ దక్క నన్యులచే వారవధ్యులు. కావున నీవనుమానింపక వీరిని నావెంటఁ బనుపుము.

దశ:—(తనలో) అయ్యో! ఇదియేమి గ్రహచారము. ఈముని తనపట్టినపట్టు విడువకున్నాఁడే. రామచంద్రుని బాసి క్షణమైన నేనుండఁగలనా? ఆరాక్షసుల ముందఱ నీబాలురేమి చేయఁగలరు? (ప్రకాశముగా) స్వామీ! ఏల యిట్టి విపరీతవాక్యము లాడుచున్నారు? దేవతలకైనను నజేయు లగునారాక్షసులెక్కడ? మృదుదేహులై తరుణవయస్కు లగునాకొమారులెక్కడ? ఇన్ని యుద్ధములు జేసినవాఁడను. నేనే యారక్కసులను దేఱిపాఱఁ జూడ వెఱతునే. సైన్యమంతయు నిచ్చెదను. నేను స్వయముగా వచ్చియుద్ధముచేయుదును, గాని యీబాలుర నాపనికై పంపఁజాలను. లేకలేక కలిగిన యీసంతానమును సుకుమారగాత్రులను నరభోజనులతోడి దారుణసంగరంబొనరింపఁ బంపుమనికోరుట మీయట్టి యహింసాపరుల కుచితమా?

విశ్వా:—(కోపముతో) చాలుచాలు. నీయుపన్యాసమిఁకఁ గట్టిపెట్టుము. కోరిన దిచ్చెదనని మొదట బింకములు పల్కి యిపుడుచే

యననియమస్మృతాలాపము లాడు హీనస్వభావుఁడవని తెలియనైతి.

ఉ. కోరిన కోర్కె తీర్తునని కొంకక ముందు వచించి యుండి నేఁ
గోరఁగఁ జేయఁ జాలనని గొప్పయబద్ధము లాడెదార! నీ
వీరవివఁశకీర్తి హరియింపఁగఁ బుట్టిన పాతకుండవై
ఘోరమణాళి నిందలను గాంతువటంచుఁ దలంపవేలొకో?

నీకేల యీమూర్ఖత? సూర్యవంశమునఁ బుట్టలేదా? నీపూర్వు లెవ్వరైన నిట్టి యబద్ధముల నాడిరా? తనువు శాశ్వతమనుకొనుచుంటివా? మాటలు కలకాల ముందు బెఱుఁగవా? పుత్త్రమోహముచే రామలక్ష్మణుల సామర్థ్య మెఱుఁగలేకున్నావు గాని వారీ రాక్షసులచే గాదు చతుర్దశభువనంబుల నెవ్వరిచేతను గూడ నజేయులని తెలియలేకున్నావు. నీకుఁ దెలియకున్న నీకులగురువగు నీవశిష్ఠమహర్షి నడుగుము. ఛీ! నీవసత్యవాదివి. నీమొగము చూడరాదు. నేను బోయెదను. (అని లేచుచున్నాఁడు.)

వశి:—విశ్వామిత్రా! కొంచెము తాళుము. దశరథా (అపవారించి) ఇది వినుము. నీకీవెఱ్ఱి యెందులకు? రాముఁడన నెవరనుకొనుచుంటివి? సాక్షాచ్ఛ్రీమహావిష్ణువు సుమా. తొలిబామున నీవు కశ్యపుఁడవు. కౌసల్య యదితి. మీరు ఘోరతపంబు సేయ శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై మీగర్భంబున నుదయింతునని వాక్రుచ్చి యున్నాఁడు. అతఁడే యీరాముఁడు. ఈతఁడు జన్మించు నను పేరాసతో నేను మీకులంబునకుఁ బురోహితుండనై మిమ్ములఁ గొల్చుచున్నాను. లేకున్న నాకీజనపదసంపర్క మెందులకు? ఇఁక నీవిశ్వామిత్రుఁడన్ననో ఋషులలో మేటిరాజర్షియై యుంటచే రాజ్యాంగతంత్రములను వైదికతంత్రములను గూడఁ బాగుగా నెఱింగిన వాఁడు. అనేకములగు శస్త్రాస్త్రవిద్యారహస్యముల నెఱిఁగిన వాఁడు. అవి యన్నియు నీకుమారులకుఁ గఱపు

సు. ఆమీఁద సిపవంశమున కంతకు ఖ్యాతి గలుగునట్లు వీరు రక్షసుల దునుమాడుదురు. కావున నీమునితోఁ నీకుమారులఁ బంపుట సర్వవిధముల శుభదాయకము.

దశ—(అపవారించి) అట్లయిన సంగీకరింతునా? కాని రాము నెడఁబాయుట యనఁగాఁ బ్రాణమును బాయుటగా నాకుఁ దోఁచుచున్నది. అందుచే సంశయించుచుంటిని.

వసి—(అపవారించి) అక్కఱలేదు. అట్టి మహర్షితోఁ బంపిన నెన్నియో శుభములు సమకూరును గాని వారికేవిధమగు నపాయమును గలుగదని నమ్ముము. తత్క్షణము మాఱుమాటాడక యంగీకరింపుము.

దశ—(విశ్వామిత్రునితో) సంయమీంద్రా! ఏల యిట్లు కినిసెదరు? రాముని యందలిప్రేమచే నట్లంటిని గాని మీయాజ్ఞ యుల్లంఘించువాఁడనే. మీ యిచ్చ వచ్చినట్లు చేయుఁడు. రామలక్ష్మణులఁ దోడ్కొంపొండు. సత్వరంబున బంపివేయుఁడు.

విశ్వా—పదిదినములకంటెు నాకుఁ బనియుండదు. తరువాత వారికిఁ బ్రియంబగు చోటున కేఁగవచ్చును. రాజా, రామలక్ష్మణులను బంపెద ననుటచే సంతుష్టాంతరంగుఁడ నైతిని. లోపలకు జని యీసంగతి నీరాణుల కెఱింగించి వెంటనే ప్రయాణసన్నద్ధులఁగాఁ జేయుము. నేనును వచ్చి నీయాతిథ్యమును సంపూర్ణముగా గ్రహింతును.

దశ—మహాప్రసాదము. నేటి కీకొలువు చాలింతము.

(అందఱునులేచి నిష్క్రమించుచున్నారు.)

---

## పంచమాంకము. రంగము. 3

సరయూనదీప్రాంతము.

(విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

విశ్వా—రామచంద్రా, ఈసరయూనదీవిభవముం జూచితివా?

మ. చలదుత్తుంగతరంగమాలికలచే స్నాతప్రకాండంబు ను
య్యేలలూఁగించి పిపాసదీఱఁ బథికాహీనప్రమోదంబులై
కలుషాపేతవినిర్మలోదకమహాఘప్రాంత దేశంబులై
విలసిల్లున్ సరయూనదీవిభవముల్ వీక్షింపుమా రాఘవా.

మఱియును.

సీ. పగలెల్లఁ గష్టంపుఁబనులచే శ్రమచెంది
చల్లనీటను మున్గు జనముగనుము
కడుపునిండఁగఁ బచ్చికను మేసి యల్లనఁ
బానార్థమై దిగు పశువు లవిగో
పై సరసత్వంబు పరికించి లోఁగోత
కనలేక కూలు వృక్షములఁ జూడు
పక్షపాతము లేని భంగి పైనటియించి
గండుమీలను మ్రింగు గ్రద్ద లివిగో

గీ. సర్వసంసారసంభారసంభృతంబు
లైన నావల నీక్షింపు మబ్ధివిభుని
జేరువేళను గొంపోవు సారె యనఁగ
సరయునది పాఱు శ్రీరామచంద్ర! గంటె.

మీరిద్దఱీనదీజలంబుల నవగాహంబు జేసి రండు. బలయబల యను రెండుమంత్రంబులు మీకుపదేశించెద వానిచే మార్గాయాసము క్షుత్పిపాసబాధలు మీకుఁగలుగక నిద్రించు నప్పుడు గాని యే

మఱిపాటున నున్నపుడు గాని శత్రువుల వలనియపాయము కూడ కలుఁగక యుండెడు. మఱియు వైరిదుర్వారతేజులరై యఖండకీర్తిని బడయుదురు. పోవుదము రండు.

రామలక్ష్మ:—మహాప్రసాదము.

(నిష్క్రమించుచున్నారు)

(తిరిగిముగ్గురును బ్రవేశింతురు)

రాము:—మహాత్మా! ఈప్రదేశము వెనుక జనాకీర్ణమైనట్టులుండి యిప్పుడు నిర్జనంబుగా గాన్పించుచున్నది. దీని వృత్తాంతమేదియో సెలవిచ్చెదరే.

విశ్వా:—అవశ్యము చెప్పెదను. ఇచ్చట మలదకరూశదేశంబులను రెండుదేశంబులు పూర్వము ధనధాన్యసమృద్ధిచే విలసిల్లుచు స్వర్గతుల్యంబులుగా నుండెడివి. అవి యిపుడు తాటక యనునొక్క రాక్షసిచే నావరింపఁబడి జనశూన్యములై యున్నవి. ఈరక్కసి మొదట యొకయక్షిణి. బ్రహ్మవరప్రసాదంబుచేఁ బుట్టుకతోడనే వేయియేనుంగుల బలముగలదై సుందునికి భార్యయై మారీచసుబాహులను పుత్త్రులఁగని యగస్త్యమహామునిశాపంబున భర్త నిహతుఁడుగాగ నాతని జంపఁబోవగా నమహాముని క్రుద్ధుండై దానిని బుత్రులను రాక్షసులుగండని శపియించిన నప్పటినుండియు నిది కురూపిణియై రాక్షసజన్మంబుతో నీదేశము లావరించి ప్రజాక్షోభ మొనరించుచున్నది. అది యిపుడుదారిలో మనకుఁ బ్రత్యక్షమగును. దుష్టరాక్షసి గావున స్త్రీయని సందేహింపక తత్క్షణము సంహరింపుము. దాన గోబ్రహ్మణ రక్షణము కలిగి నీకు యశంబు చేకూఱును.

రాము:—స్త్రీవధము చేయుటకంటె ముక్కును జెవులును గోసినఁ జాలదా మహాత్మా.

విశ్వా:—అట్లు గాదు. అది మిక్కిలి చెడ్డరాక్షసి దుర్మార్గులగు స్త్రీలవధ పాపము కాదు. స్త్రీపురుషవివక్షతచేయుటకుఁ గొంత వ్యవస్థ కలదు. అది మీఱినచో నట్టి భేద మెన్నుటక నవసరము లేదు. మహాజ్ఞానియైలోక మంతయు బ్రహ్మమయముగాఁ జూచు వానికి స్త్రీపురుషవిచక్షణ మక్కఱలేదు. లోకోపద్రవకరముల గు కార్యములఁ జేయువారి దండించుటకు స్త్రీపురుషవిచక్షణ మక్కఱలేదు. పూర్వ మెన్నడైన స్త్రీవధము జరిగినదా యం దు వేని నింద్రుఁడు మంథరను శ్రీమహావిష్ణువు భృగుపత్నిని జంపి యుండిరి. కావునఁ గనికర మూనక వెంటనేదీని బరిమార్పుము.

(తాటకప్రవేశించును)

తాటక—ఒరేదుర్మార్గులారా, ఎవరురా నాసెలవులేని దేశండకావ రముచే నావనము ప్రవేశించుచున్నారు? మిమ్ము ముగ్గుర నొక్క కబళంబుగా మ్రింగెదను. ఆ. ఆ. (అనిఅఱచుచున్నది.) నర మాంసము దొరికి చాలదినము లైనది. నేడు కడుపునిండ భోజ నము దొరికినది. ఆ ఆ (అనినోరు తెఱచుచున్నది.)

లక్ష్మ—(వెనుకనుండి వచ్చి యొకతన్ను తన్నును)

తాటక—(వెనుకకుఁ దిరిగి) ఓరీ ముందుగా నిన్నే చప్పరింతును. (అని లక్ష్మణుని తఱుమును)

రాము:—(తాటకను నఱముచు) ఓసీ! బాలునితో నేమి? ఇటు రమ్ము (అనివింటికొనతో వీపుమీఁద పొడుచును.)

తాటక:—(రామునివైపుతిరిగి) ఆ (యనిమ్రింగఁబోవును)

లక్ష్మ:—(కత్తితో తాటకవీపుపై నేసి) ఈదెబ్బతోఁ జచ్చెదవులే రక్కసీ.

తాటక:—(లక్ష్మణుని దిరిగి తఱుముచు) అబ్బా! ఎంతదెబ్బకొట్టితివి. నిన్నింక విడువను.

విశ్వా:—రామా! ఇదే సమయము. ఇప్పుడస్త్రప్రయోగముచేయ నిచో నిదిలక్ష్మణుని మ్రింగును.

రాము:—ఇదిగో చేయుచున్నాఁడను (అని బాణమువదులును.)

తాటక:—(క్రిందబడి) హా! తెలిసినది. అగస్త్యమహాముని చెప్పి నాఁడు. నీవు సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁడవు. నీచే బడుటచే నేను ధన్యనైతిని. ఇఁక నీబాధభరింపఁజాల. శరమూడఁబెరికి నన్ను బరమపదంబున కనుపుము.

రాము:—మంచిది. (అని శరములాగుచున్నాఁడు)

లక్ష్మ:—ఇన్ని పాపములు చేసిన రాక్షసిముండవు. నీకుఁ బరమప దమేమిటి; ఘోరనరకమున కనుపమనుము.

విశ్వా:—లక్ష్మణా! అట్లుకాదు. అన్నయ్యచేతిలో మరణమొందు టచే నిది ధన్యురాలుగాదా.

లక్ష్మ:—తాతగారూ! అవునండి. ఆమాటలు మఱచితిని.

రాము:—తమ్ముఁడా! మఱియొక సంగతి. చచ్చిపోవుచున్న యీ వనితను గర్ణకఠోరముగా దూషించితివి. శత్రుత్వమిత్రత్వము లీ లోకమందున్నంతవఱకే యుండునుగాని పరలోకమున కేగుచు న్నవాని శత్రువు నైనను గనికరమూనవలసినదే సుమా.

లక్ష్మ:—అన్నయ్యా! తెలియక యంటిని. క్షమింపుము.

విశ్వా:—నేటి కీనిఖిలజనకంటక యగు తాటక నేలఁ గూలుటచే నిచ్చటి సమస్తప్రాణులు సుఖింపఁగలవు. ఇఁక మనము ముందు బోవుదము రండు.

(నిష్క్రమించుచున్నారు.)

---

## పంచమాంకము — రంగము. 3

సిద్ధాశ్రమము—(విశ్వామిత్రాదిమహర్షులు యాగము చేయుచుండఁగా రామలక్ష్మణులు వింటను బాణము సంధించి ముందుండురు.)

రాము:—

ఉ. తమ్ముఁడ రాక్షసుల్ బహువిధతంత్రవిశారదు లెన్నియేని రూ
పమ్ములఁ దాల్చి మాయలను బన్ని మునీంద్రునియజ్ఞము న్వినా
శమ్మొనరింపఁ జూతురు ప్రచండతరాస్త్రవిధానయుక్తకా
ర్యమ్ముల జాగరూకుఁడవునై బరిమార్పఁగఁ నెంచగా వలెన్.

ఈరాక్షసజాతి మొదటినుండియు లోకోపద్రవములఁ జేయుచునే యున్నది. ఒకడు ధాత యొద్దనున్న వేదంబుల హరించి మున్నీటఁ డాగియుండె. కొందఱు దేవతలకమృతంబులేక యుండ యత్నించిరి. ఒకానొకఁడు నిలాతలంబు చాపచుట్టగ జుట్టి యలయించె. ఇంకొకఁడు విష్ణుభక్తుఁడగు బాలుని పలుబాములు పెట్టి హింసించెను మఱియొకఁడు నింద్రుని బాఱఁదోలి స్వర్గరాజ్యము హరించెను. వేఱొకఁడు మునీశ్వరుని కామధేనువును దొంగిలెను. ఇవన్నియు గతములు. ఇప్పుడింకను దలబరువుగల రాక్షసులున్నారని వినుచున్నారము. వారిసాధులగు మునీంద్రుల యాగధ్వంసాదికార్యాంబులహింసించుచుఁడుటచేఁదమనాశము తామే తెచ్చుకొనుచున్నారు.

గీ. సాధుసజ్జనసంతాపసంగతంబు
లయిన కృత్యంబులే కులక్షయముదెచ్చు
తానె నిర్మించుకొనునట్టి తంతువాస
మునసె మరణంబుగను సాలె పురుగు రీతి.

లక్ష్మ—అన్నయ్యా, అటులైన మనము నేర్చికొనిన యస్త్రవిద్యకు ఫలమేమి?

రాము—ఓయివెఱ్ఱివాఁడా. అట్లుగాదు మనము నిమిత్తమాత్రులము.

ఏకార్యమేని నిమిత్తము లేకుండ జరుగునా? మనధర్మము మన
ము నెరవేర్చికొనుటచే లోకంబున యశంబు గాంచుచున్నాము.
అదియంతయుఁ దరువాత సావకాశముగాఁ జెప్పెదను. అదిగో.
ఎవరో రాక్షసులు వచ్చుచున్నట్లున్నారు. భద్రంబుగానుండుము.

(మారీచసుబాహులు ప్రవేశించుచున్నారు.)

మారీ—(అపవారించి) ఒరేసుబాహు, వీరే దశరథరాజపుత్రులు
గాబోలు. ఆముసలిరాజు సేనతోఁ దాను స్వయముగా రాక
యీబొడ్డూడని వాళ్ళను బంపినాడేమిరా? కడుపునిండ సరభోజ
నము చేయుదమన్నను వీరొక్కదవడకెక్కిందికైనను రారు. నాకు
మిక్కిలియాకలిగానున్నది. వీరినిద్దఱినొక్కకబళముగాఁ గొందును.

సుబా—(అపవారించి) నాకు నీకన్న నెక్కుడాఁకలిగానున్నది. నేనే
వీరిని భక్షించెదను. పోనీ నీవొకని దినుము. నేనొకని దిందును.

మారీ—(అపవారించి) కానీ నాకొక సందేహము మాత్రము గలుఁ
గుచున్నదిరా. ఇంత చిన్నపిల్లవాండ్లను మనయమ్మ తాటక
యేల మ్రింగలేకపోయెను? అంతే కాక వీండ్ల బాణమొక్కటిచే
తనే నేలఁగూలినదఁట. కావున నేదో మాయవిద్దె వీండ్లయొద్ద
నున్నట్లు తోఁచుచున్నది.

సుబా—ఏమున్నది నీమొగము. అమ్మ ముసలిదై యేపరాకునను
న్నప్పుడో వీండ్లు కొట్టియుందురు. నీకంతభయముగానున్న నీవు
వాండ్లజోలికిఁ బోకుము. నేనే కడతేర్తును.

మారీ—ఓరీ! భయ మేమిటిరా, నీవేమందువో యని యంటినిగా
ని నాకేమిభయము. జలస్తంభనాదివిద్యల నెన్నియో నేర్చిన
నాకీలోకమున భయమెవరివలన? చూడు మిప్పుడే వాండ్ల నెదు
ర్కొందును.

(అని రామలక్ష్మణులసమీపించి)

అరే. ఎవరురా మీరు? ఇంత నిర్భయముగా విల్లు నమ్ములు బూని కూర్చున్నారు. ఇది నరభోజనులు తిరుగు నుగ్రాటవి యని యెఱుఁగరో? మిమ్ము జూచిన జాలి వేయుచున్నది. మీదుండగము లకుఁ గోపమును వచ్చుచున్నది. శీఘ్రముగా నవ్వలకుఁ బొండు. లేకున్న మిమ్మిద్దఱ నొక్కపెట్టున మ్రింగువాఁడ.

రాము—ఛీ, ఛీ, నోరుమూయుము.

పంచచామరము.

అరే దురాత్మ! యేల కాఱులాడె దీవు క్రొవ్వి సం
గరంబు సేయు మోపుదేని లేసిచోఁ దొలంగుమా
నరాశ నుండ వాచుఁ బ్రాణినాశనం బొనర్చు నిశ్
శరాసనంబు నెక్కువెట్టి చంపువాఁడ నిప్పుడే.

మారీ—ఏమీ!

ఉ. సురాసురుల్ జయింపరాని శూరు నిట్లు చుల్కగా
బిరానఁ బల్కెదౌర! యొక్కపెట్టునన్ ఖరాసిచే
ధరన్ బడంగ నేయువాఁడ దర్పమేది యిచ్చటన్
వొఱంగవేని నిన్నువీఁడ దుర్బలుండ పోవుమా.

లక్ష్మ—(సుబాహునుద్దేశించి)

సుగంధి. ఏలమూర్ఖ, చూచెదట్టులేను నీకు మృత్యువై
కూలనేయువాఁడ నొక్కకోలచేత, సాధులన్
జాలబాధలొందఁజేయ సాహసింప తత్ఫలం
బోలి కట్టి కుడ్పకుండ నోపునోటు దుర్మతీ.

సుబా—

ఉత్సాహ. చాలు చాలు, దుండగంపు సాహసంపు వాక్యముల్
బాలకుండవౌట నీవు బ్రతికిపోతి వియ్యెడన్
గోలఁబట్టి వేయనేర్తె గ్రుక్కవచ్చి పిల్లనే
గేలిసేసి నట్టులయ్యె నీడు నొందకేగుమా.

రాము—ఓరక్కసులారా, మనయుద్ధమునకిది తగినప్రదేశముకాదు ఎదుట నున్న యానమప్రదేశమునకుఁ బోవుదము రండు.

మారీ-సుబా—అటులనే చేయుదము రండు.

(మునులు కాక యందరు నిష్క్రమింతురు)

(రామలక్ష్మణులు తిరిగి ప్రవేశింతురు)

లక్ష్మ—అన్నయ్యా, వీరెంతసేపో పోరుదు రనుకొంటిని. నీవేసిన యొక్కబాణముచేతనే యొక్కొక్కఁడీల్గినట్లున్నాఁడే ఈ పెద్దరక్కసులతో యుద్ధమొనర్ప నాకవకాశమే యీయనైతివి.

రాము—తమ్ముఁడా! యీపెద్దరక్కసులలో నొకఁడు నేల గూలినాఁడు. రెండవవాఁడు వాయువ్యాస్త్రవేగముచే నెగురఁ గొట్టబడినాఁడు. ఎక్కడఁబడినాఁడో తెలియరాకున్నది. కాని బహు దూరముననుండియుండును. నీవుచిల్లరరక్కసిమూకలనేమిచేసితివి?

లక్ష్మ—మొదట బాణంబులచే సంహరింప యత్నించితిని కానివారు పెచ్చుపెఱిగి విచ్చలవిడి వచ్చుచుండుట చూచి యాగ్నేయాస్త్రంబుం బ్రయోగించితి. అదియొక్కమ్మడీ వారినందఱ ముట్టడించి భస్మంపురాసులుగ నొనర్ప నింక నక్కడఁ జేయుపని లేక తిరిగి వచ్చితిని.

రాము—సెబాస్ తమ్ముఁడా సెబాస్! అస్త్రవిద్య నమయస్ఫూర్తిగా బ్రయోగించితివి! ఇఁక నీబుషీశ్వరుని యాగము నిర్విఘ్నముగాఁ గొనసాగుగాక.

విశ్వా—(ఋషులతోలేచివచ్చి) జయము, జయము, దశరథాత్మజులారా, జయము. దైవకృపవలనను మీబాహుపరాక్రమమువలనను యాగము పరిసమాప్తి నొందుటయేగాక రాక్షసబాధయు నివారణమైనది. యజ్ఞేశ్వరుని యీప్రసాదముఁ ముందుగ్రహియింపుడు, (పూలమాలికలు మెడలలో వైచుచున్నాఁడు)

రామ-లక్ష్మ—మహాప్రసాదము (అని నమస్కరించుచున్నారు)

విశ్వా-ఋషులు—(చేయెత్తి) కళ్యాణమస్తు. శీఘ్రకళ్యాణమస్తు.

విస్వ—ఆహా

మ. చిరకాలంబున కాత్మవాంఛితము మచ్ఛ్రేయోభిధాయంబు నీ
వరమేధం బొనరింపఁ జాలితి భవత్ప్రిచ్ఛిష్యసాహాయ్యబం
ధురతన్ బ్రత్యుపకారమేమి యొనరింతున్ మీకు సర్వార్థముల్.
గరిమం గూర్చుచు దేవుఁడీవుత మహాకళ్యాణసౌభాగ్యముల్.

రామ—మునీంద్రా యట్లనద రేమి? ఇందు మేమేమి యొనర్చితిమి. మీవిద్యాప్రభావమే యీకార్యనిర్వాహణకారణము.

విశ్వా—రామచంద్రా. గురుభక్తి ప్రకటితముగా నీవాడిన యీపలుకులకు మోసపోవువాఁడనుగాను. నీవెవరవో నేనెఱుఁగనా? ఇఁక రండు నేటికి విశ్రమింతము.

(అందఱు నిష్క్రమింతురు.)



శ్రీ

# అహల్యాశాపవిమోచనము.

## షష్ఠాంకము.

### రంగము. ౧

(విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

విశ్వా:—రవివంశోత్తములారా, కాల్యంబుల నిర్వర్తించికొంటిరా? రేయి సుఖసుషుప్తిం జెందితిరా? హంసతూలికాపర్యంకంబులం శయనించు మీకీ కుశాస్తరణంబుల నంతగా సుఖనిద్రయుండక పోవచ్చును. కాని రామచంద్రా, కొలదిదినంబులలో యువరాజ్యపట్టాభిషేకముం బడసెడు నీకు యరణ్యవాసుల కష్టసుఖము లిట్టియనుభవమూలమునఁ దెలిసినట్లు మఱియొండువిధమునఁ దెలియనగునే?

గీ. స్వానుభవమూలమున గాంచు నట్టి తెలివి
కన్యబోధలచేఁ గల్గునది సమంబె
సుందరాంగిని గనులారఁ జూచుముదము
గలుగునే చిత్రరూపవీక్షణము చేత.

రామ:—ఆర్యా! అట్లనెద రేల? మాకేకొఱంతయు లేక యింటిదగ్గఱకంటె సుఖతరంబుగ నీతరువరంబులఁ జల్లనిగాలి మేనిసోఁకి నిద్ర పట్టినది. తండ్రిగారెప్పుడును

గీ. అడవులందున వేఁటాడి యలసి యుండి
చెట్లనీడను నిద్రించు శ్రేష్ఠసుఖము
రాజకార్యనిమగ్నత రాక నిదుర
హంసతూలికశయ్యలం దరయ నెపుడు.

అని చెప్పుచుందురు. అది మాకు నేఁడు కొంతయనుభవము లోనికి వచ్చినది. తెలవాఱు నపుడు మాతండ్రి యొక స్వప్నము వచ్చి యందునతిరమణీయమైన ఫలమొకటి మీరు నాకిచ్చినటుల నయ్యెను. దానిఫలమేమో.

విశ్వా:—తెల్లవాఱునపుడు వచ్చుస్వప్నము యథార్థఫలమిచ్చును. మాయాశ్రమంబునకు వచ్చి యుండుటచే నట్టియపూర్వసౌందర్యావనీజాతఫలంబు మీకుఁ బ్రత్యక్షంబుగనే లభించుగాత. ఇఁకను మత్పూర్వార్జితంబులైన మహామహిమ గలయస్త్రంబులు గొన్ని మీకుపదేశించి యిచ్చెదను. వానిచే సర్వశత్రుసంహారంబు గావించి యశంబు వడయుదురు. (అని కొన్ని బాణములు తీయుచున్నాఁడు.)

రాము:—మహాప్రసాదము

లక్ష్మ:—తాతగారూ! అస్త్రములు మంత్రములు కావా? ఏమిటి సంచిలో నుండి తీయుచున్నారు?

విశ్వా:—ఔను మంత్రములే. అవి యీశరములపై లిఖింపఁబడి కొన్నియంత్రరూపమునఁ గూడ నున్నవి. వాని ప్రయోగోపసంహారములు నేను జపముచేసికొన్నతరువాత నుపదేశింతును.

లక్ష్మ:—మహాప్రసాదము.

విశ్వా:—(బాణములఁదీయుచు) ఇదిగో ఇది బ్రహ్మాస్త్రము. దీనిచే నెట్టి కడింది శత్రువైనను మూర్ఛ జెందును. ఒకవిధమగు ప్రయోగముచే సర్వసంహారము చేయును. ఇది యాగ్నేయాస్త్రము. సర్వశత్రుదాహకము. ఇది వాయువ్యాస్త్రము. దీనిచే శత్రువులు ప్రచండమారుతమున దూదిపింజలవలె నెగిరిపోదురు. ఇది సమ్మోహనాస్త్రము. దీనిచే శత్రుసైన్యమంతయు మూర్ఛిల్లును. ఇది మహాద్భుతమైన నారాయణాస్త్రము. దీని కేదియు నడ్డులే

దు. ఇది ఎదిరి ప్రయోగించు సర్వాస్త్రంబుల దిగమ్రింగి శత్రు
నాశం బొనర్చును. మఱియు జృంభకాస్త్రాదులు కొన్ని యిది
వరలో మీకుపదేశించి యుంటి. వీనిబలంబుచే మీరు లోకకం
టకులైన శత్రువులఁ దున్మాడి ప్రజామోదముగ లోకపాలన
మొనర్తురు గాక.

రామ-లక్ష్మ:—మహాప్రసాదము.

(ఒకఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఒక—మహాత్మా నమస్కారము. (అని విశ్వామిత్రునికి నమస్క
రించును.)

విశ్వా—నీవెవ్వఁడవు?

ఒక—నేను మిథిలేశ్వరుండను జనకచక్రవర్తి సేవకుఁడను. మామ
హారాజుగారీలేఖను బటమును మీకు నర్పింప నన్ను బుత్తెం
చినారు.

(అని యుత్తరమును జిత్రపటమును నిచ్చుచున్నాఁడు.)

విశ్వా—రామచంద్రా! ఈయుత్తర మేమియో చదువుము. శుభలేఖ
వలె గాన్పించుచున్నది.

రాము—(లేఖవిప్పి)

“స్వస్తి శ్రీమదఖండతపోవిరాజమానబ్రహ్మతేజోరూపులగు
విశ్వామిత్రులవారి పాదపద్మములసన్నిధికి. భవదంతేవాసి మిథిలా
పురీశ్వరుండగు జనకుండు వ్రాసికొను శుభలేఖార్థవిజ్ఞాపనములు.

నాఁడు యజ్ఞార్థంబు నేను పుడమి దున్నించుచుండగా హలా
గ్రంబునకొక పేటిక దగులుటయు, నందు సురుచిరరూపవతి యగు
నొకకన్యకామణి లభ్యంబగుటయు దానికి సీతయను నామంబిడి నేను
మత్పుత్రికగాఁ బెంచుచుండుటయు మీ రెఱింగినదేగదా. ఆసీత శీత
మయూఖునిం బోలె నానాఁటికిఁ గళల నభివృద్ధి చెందుచు మద్గృహం

బున వంశానుగతంబుగ నర్చింపఁబడుచు మహాభారము గలిగి వేవు రు బలాఢ్యు లెత్తఁదగిన శివశాపంబు నవలీల నొక్కచేత నాటలన డుమ నెత్తి యిటు నటు బెట్టుటంగాంచి భయాద్భుతరసనిమగ్నుం డనై యీామె కెవ్వరు భర్తగానుండఁదగినవారని చింతించుచుండి పరిణయకాలము రాఁగా నాధనువెవరెక్కుబెట్టిన వారికి నీమె నిత్తునని ప్రతిన జేసి రాజలోకంబునకు శుభలేఖల నంపి యున్నవాఁడను. వారంద ఱెల్లి యిచ్చటకు వచ్చి తమధనుర్విద్యాకౌశలముఁ జూపుదు రు. తత్సమయంబున మీరు బంధుమిత్రఛాత్రసహితంబుగా విచ్చేసి నన్నానందింపఁ జేయ గోరుచున్నాడను. చిత్తగింపుఁడు.

ఇట్లు,

భవదత్యంతవిధేయ సేవకుఁడు

జనకుఁడు."

విశ్వా—ఓహో, అన్నియును క్రమముగా వచ్చుచున్నవి. సీతాక ళ్యాణమహోత్సవమును జూచుటకును జనకచక్రవర్తికి మాయం దుగల తాత్పర్యమునకును జాలసంతోషముగా నున్నది. రామ చంద్రా, నేనీసేవకునకుఁ గొన్ని సంగతులు చెప్పి పుత్తెంచి వచ్చె దను. మీర లిచ్చటనే యుండుఁడు.

(సేవకునితో నిష్క్రమించుచున్నాఁడు).

రాము—(చిత్రపటము తీసి చూపుచు) లక్ష్మణా, యీజనకరాజపు త్రివిలాసముజూచితివా?

ఉ. మేలిమిబంగరున్ దనువు మీరినదైన శిరీషపుష్పముల్
బోలెడు మార్దవంబున ప్రఫుల్లసరోజవిలాసమయ్యె నె
వ్వేళను దోఁచుమోము ప్రతిబింబమిదయ్యె నిజాకృతిల్ బలెల్
గ్రాలెడు నౌర! శిల్పినిపుణత్వమొ, సత్యమొ, తోఁచదాత్మకున్.

మఱియు

సీ. లేనవ్వువెన్నెలల్ గానుపించుచునుండ
ముఖము చందురుఁడన బోలదొక్క
తలిరుహస్తంబులు దనరారు చుండంగ
గలికి లతాతన్వి గాదెచూడ
చూపఱ ధైర్యంబు సుక్కడఁజేసెడు చూపు
లతనుతూపు లనంగ నబ్రిహానె
వీక్షణాస్త్రంబుల వెదజల్లగాఁ జాలు
భ్రూకుటి మరుని కార్ముకముగాదె
గీ. ఎదుటివారిని లోగ్రిహియించు వీనిఁ
జెక్కుటద్దములని చెప్పఁ జిత్రిమానె
అధరసుధతోడ జన్మంబు నంది యుంట
శ్రీమహాలక్ష్మి యే యనఁ జెలఁగుగాదె.

లక్ష్మ:—అన్నయ్యా! నీవనినట్లీమె శ్రీమహాలక్ష్మివలెనే శాంతరస మొలుక దృష్టులతోఁ గానవచ్చు చున్నది. వసిష్ఠభగవానులు నిన్ను శ్రీమన్నారాయణావతారంబుగఁ జెప్పుచుండుటవలన ని దివఱకే మీకు దైవఘటన యున్నట్లు తోఁచుచున్నది.

రాము:—లక్ష్మణా! ఈచిత్రిపటమందలి యిఁక నొక విశేషము చూచితివా?

మ. హరుచాపం బొక కేల నడ్డముగ నొయ్యారంబుగా బూని యే
శరముల్ గూర్పక లీవిగానిలుచు నీచంద్రాస్య నీక్షించితే
విరిబాణంబుల నెప్పుడున్ గలుఁగమిన్ వేసారి చాపంబునన్
స్మరుఁడీయింతిని నూత్నబాణముగ దా సంధించినట్లొప్పెడున్.

లక్ష్మ—అన్నయ్యా, అంతియ కాదు.

గీ. దుష్టసంహారమొనరించి శిష్టజనుల
బ్రోవ నీచాప మెవ్వడు బూని తనదు

జనని భూదేవిభారంబు సరగ ద్రోచు
వానికేల్లోన, గోరెడుదాని బోలు.

రాము:—నీవు చెప్పినదియు సమంజసముగా నున్నది. దుష్టనిగ్రహ శిష్టసంరక్షణము లుత్తమక్షత్రియ ధర్మములే కదా. ఈతన్వి నిశ్చయముగా నుత్తమక్షత్రియార్హయే.

లక్ష్మ—కాని జనకమహారాజు శివచాపఖండన మొకప్రతిజ్ఞగా నుంచినాఁడే అది సుసాధ్యమా?

రాము—అది దేహబలముచే నంతసుసాధ్యము గాకపోయినను లక్ష్య పాటవంబున నవలీల నెఱవేర్ప నగును.

లక్ష్మ—ఆయితే, మన కాహ్వానములేకుండ మిథిలకుఁ బోవచ్చునా?

రాము—ఓయి వెఱ్ఱివాఁడా, విశ్వామిత్రమహర్షికి నచ్ఛాత్రింబుగ రమ్మని వ్రాయలేదఁటోయి మనము ఛాత్రులమగుదుమా కామా? అదియునుంగాక పౌరుషకార్యనిర్వాహణంబులకు వేఱుగఁ బ్రత్యేకించి యాహ్వాన మక్కఱలేదు. రాజలోకమంతయు నుద్దేశింపఁబడినదే.

(తెఱలో).

మ. పవనోద్వేగము జాఱ వృక్షములు స్తంభప్రక్రియన్ జూపు; జంతువులున్ మేఁతకు నేగి యిక్కలకు గంతుల్ వైచుచున్ బాఱు; పాట్టవిగా నీడలు దోఁచు భాస్కరుని థాటిన్ జూడ మధ్యాహ్నమా రవివంశాగ్రణులార! రండిఁకను గార్యంబుల్ ప్రవర్తింపఁగన్.

రాము—అదిగో! విశ్వామిత్రులవారి యాజ్ఞయైనది. లోనికిఁబోవుదము రమ్ము.

(నిష్క్రమించుచున్నారు)

---

## షష్ఠాంకము—రంగము ౨.



### అరణ్యమార్గము.

(రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.)

రాము—తమ్ముఁడా, విశ్వామిత్రమహర్షి యత్రిమహామునితోఁ గొన్ని సంగతులు మాట్లాడి వచ్చెదననియు మనల నీమార్గంబున జను చుండుఁడనియు గదా సెలవిచ్చిరి. ఆయన యింకను రాలేదు.

లక్ష్మ—అవును. ఆయన వచ్చెదనుక నిక్కడ కొంతసేపాగుట మంచిది యనితోఁచుచున్నది.

రాము—అట్లు చేయుదము. దాని వలన నిచ్చట వింతగా నున్న యరణ్యసౌందర్యముం దిలకింప నవకాశమబ్బును. లక్ష్మణా యిటు గనుము.

రగడ— ఈవనముఁ గన నెంతయు చోద్యము
భావింపగ సర్వంబును హృద్యము.
సాలము లంబర సంగతములునయి
చాలబలిష్ఠత జవమోదములయి
వల్లీ వేల్లితవరకాండములయి
చల్లనినీడల శాంతిదములునయి
స్వాదురసాస్వద ఫలభరితములయి
మేధురగంధామితపుష్పములయి
శుకపికకూజితశోభితములునయి
సకలవిహంగమసంవాసములయి
యెంతయునొప్పెడు;

లక్ష్మ—.....................నిటుల ఘనముగను.

వింత నెసఁగు పృథ్వీధరమునుగను
హిమవన్నగమును హెచ్చెడు సమున్నతి
అమరవరుల ప్రాపయ్యెడు నీక్షితి
రమణికి శిరమయి రమ్యలతాదులు
విమలశిరోజపువితతిగఁ దోఁచులు
పాపటవలె నిబ్బరముగఁ దోఁచెడు
గోపురముండెడు గహ్వరములుగడు
భీకరములునౌ బెబ్బులి పిండులు
నాఁకటఁ బైఁబడి హర్యక్షంబులు
కరికుంభంబుల ఖరనఖరంబుల
వెరవుగఁ జీల్పఁగఁ బృథ్విని జలజల
రాలెడు ముత్యపురాసుల గనుమవె
రాము— శైలశిఖరనిర్ఝరవాహములవె
శిలలనుబడి రొద సేయమయూరము
లెలమిని నాడెడు నింపుగఁ జూడుము
అద్దైన గనుము పయఃపూర్ణంబులు
ముద్దులొలుకు నంబుజకీర్ణంబులు
ఘనసారములౌ కాసారంబులు
కనులకుఁ జల్లగ కల్హారంబులు
సారంగంబుల ఝుంకారంబులు
కోరని శ్రుతియై కోకిలరవములు
గానామృతమై కర్ణమునింపెడు
సూనామోదము చూఱగొనుచుకడు
మెల్లనవీచు సమీరపు గోదములు
చల్లఁగ పాంథశ్రమహరణంబులు

గా నలరారెడు గంటే సోదర
కానలసుఖము జగానను లేదుర.

విశ్వా:—(ప్రవేశించి) రామచంద్రా! ఏమనుచుంటివి? అరణ్యావాసనసౌఖ్యమే యెక్కువనియా? ఔను. అట్లు తోఁచుట యుచితమె. సదాజనాకీర్ణములై మనోద్వేగవృత్తుల నాపాదించు నగరంబుల నివసించుచు నెప్పుడో యొకసారి యీనిర్జనప్రదేశములం గాంచి ప్రకృతిసౌందర్యముం దిలకించువారికివి సౌఖ్యావహములుగ గన్పట్టు. అట్లనే యీపర్ణశాలలవసించువారికి నగరసందర్శనమైనయప్పు డచ్చటి కృత్రిమవస్తురామణీయకమును నిట్లేయపు ట్టించెడు.

రాము—అటులైనచోఁ గొంతకాలమడవులయందును మఱికొంత కాలమునగరులందును వసించుటచే నిట్టిభ్రాంతులు తొలఁగునని మీయభిప్రాయమా?

విశ్వా:—ఒక్కభ్రాంతినివారణార్థమే గాదు. ప్రతిమనుజునికి నట్లుండుట యవసరమైయే యున్నది. లోకోపకారార్థమును లోకజ్ఞానముకొఱకును నగరులందు వసించుటయు నాత్మోపకారార్థము నాత్మజ్ఞానముకొఱకు నడవులందు వసించుటయు సామాన్యముగాఁ గావలసియే యున్నది. కాని మహాత్ము లెక్కడ నున్న నుభయతారకముగానే వర్తింతురు. అందునకు మనముచూడఁబోవు మిథిలాపురచక్రవర్తియే నిదర్శనము.

రాము—నగరులనున్నవారిలో వారును కాననముల నున్నవారిలో మీరును నిదర్శనులని మాయమ్మ సుమిత్రాదేవిగారినలన నిదివఱలో వినియున్నాఁడను.

విశ్వా:—అట్లుగాదు. జనకచక్రవర్తివలె నుండుటయే కష్టము. అస్మదాదులు పెక్కండ్రు గలరు. ఇఁక నాలస్యమగుచున్నది.

మనము నడుచుచు మాట్లాడుకొందము రండు.

(అని అందఱు కొంత నడుచుట నభినయించి)

విశ్వా:—రామచంద్రా, ఈవనప్రదేశ మెంతరమణీయముగా నున్నదో చూచితివా? దీనికిఁ గాశ్యపవనం బని పేరు. ఇచ్చట నదితికశ్యపులు శ్రీమన్నారాయణునిగూర్చి ఘోరతపం బొనరించిరి. వారితపోమహిమచే నిందుఁ బ్రవేశించుఘాతుకమృగంబులు తమక్రౌర్యంబు విడిచి సాధువులుగా నిప్పటికిని గన్పట్టు.

రాము—ఈతపోవనసందర్శనంబుచే ధన్యులమైతిమి నిరంతరఫలకుసుమవిరాజితంబులగు వృక్షజాలంబులచే మనోహరం బగు నీప్రదేశము తపంబున కెంతయు నర్హమై యున్నది.

విశ్వా:—ఇదిగో. ఇది యింద్రతీర్థ మనుపేరిటి సరోవరము. తొల్లి బలిచక్రవర్తిచే స్వర్గపదచ్యుతుఁడైన దేవేంద్రుఁడు శ్రీమహావిష్ణువుఁగూర్చి యిచ్చట ఘోరతపం బొనరించినాఁడు.

లక్ష్మ:—ఈయింద్రున కెప్పుడు నేదో కష్టములు కలుగుచునుండు నే. కారణ మేమై యుండును మహాత్మా?

విశ్వా:—లక్ష్మణా, దానికి సర్వజగత్కారణుం డైన యీరామచంద్రమూర్తియే కారణము. మొకట నుత్కృష్టపదవుల నొసంగి వానిచే గర్వపడుచుండువారిని దిరిగి తత్పదచ్యుతులం జేసి గర్వరహితులై తన్ను గొలిచినచో తిరిగి యుద్ధరించుచుఁ దో లుబొమ్మలట్లు నీటగ మంతయు నాడించు నీమహానుభావుఁడే కారణము.

రాము—మునీంద్రచంద్రమా! మీశిష్యునికే యింతసామర్థ్య మున్నచో మీమహత్వంబు లోకమం దెట్లు ప్రఖ్యాతమై యుండునో వేఱుగఁ జెప్పనేల? మీయనుగ్రహము వడసినవాఁడు స్వర్గచ్యుతుఁడైనను వానికడకే స్వర్గము వచ్చునట్లు జేయుదురుగాదె?

విశ్వా—రామచంద్రా! ఇట్టిమాటలచే నేలమౌనముచేసెదవు? నీ వెవ్వరవో యెఱుంగనివాఁడను కాను. నీశిష్యత్వముకొఱకే యెన్నినాళ్ళనుండియో వేఁచియున్నవాఁడను. సురూపలావణ్యవతి యగుకన్యకారత్నమును దగినవరుని కొసంగి సంతసించు జనకునివలె మదధీనంబై యున్నవిద్యల నీకొసంగి తరించితి నని సంతసించు చుంటిని. సచ్ఛాత్రునిచే గురునిప్రతిభయు గురునిచే ఛాత్రునిప్రతిభయుఁ బ్రకాశించుట లోకవిదితమే కదా?

రాము—ఇఁకమీశిష్యవాత్సల్యతకు మేరఁ గన్పించుట లేదు. స్వామీ! యీపాడుపడిన గృహంబులుగలవనభూమి యెవరిది? వసంతకాలమునకు ముందెండిపోయినట్లు గాన్పించు వృక్షములవలె శోభారహితమయ్యు నంతస్సారమెడలనియట్లుఁ దోఁచుచున్నది.

విశ్వా—సర్వజ్ఞుఁడవగు నీకుఁ దెలియని దేమున్నది? ఇదియే నేనిదివరలోఁ జెప్పిన గౌతమాశ్రమము. మహానుభావుఁడు గౌతముఁడు ద్వాదశవర్షక్షామము పట్టినప్పుడు ప్రజల నెందఱినో తన ప్రజల నట్టిగృహంబులనిలిపి నిరతాన్నప్రదానము చేసి రక్షించినాఁడు.

సీ. కటకటంబడుచు నాఁకటిబాధ కోర్వని
జీవకోటులను రక్షించినాఁడు
దినదినంబును ధాన్యమును జల్లి పంటలఁ
బండించి క్షామంబు బాపినాఁడు
ఆంధ్రులదైన్యంబు లడుగంట గోదావ
రీనది తెచ్చి పాలించినాఁడు
ధర్మసూక్ష్మంబుల ధాతను మెప్పించి
పడఁతియహల్యను బడసినాఁడు

గీ. న్యాయశాస్త్రమునందు తనంతవారి
శిష్యగణమును బోధించి చేసినాఁడు
యట్టిగౌతముఁడిటలేక యకట! యెట్లు
సర్వమును మాఱె కాలవశంబుచేత.

రామచంద్రా! యీప్రదేశము చూచినకొలఁది మిగులసం
తాపకరముగా నున్నది.

మ. ఇటఁమౌనీంద్రుఁడుద్రేల్చెనగ్నులనిటన్ హెచ్చైనగాత్రింబుతో
జటుల న్వేదము చెప్పుశిష్యతతి యశ్రాంతంబుగా నన్నమి
చ్చట నొడ్డించె నహల్య బీదలకు వాసంబిచ్చుచున్ నిమ్నగా
తటమందచ్చట వేకువన్ దపము శ్రీద్ధన్ జేయు నమ్మౌనియున్

రాము—ఆహా, యిట్టి పవిత్రతరమైన భూములఁ జొచ్చుటచే నేఁడు
మిగులఁ బావనులమైతిమి.

లక్ష్మ—అన్నయ్యా! ఆశిలాఫలకముం జూచితివా? భూకంపముగ
చ్చినరీతిఁ గొంచెము హఠాత్తుగాఁ గదలినట్లు గోచరించినది.

రామ—ఏమీ! అచ్చటనేమైన జీవజంతువులు గలవేమోచూతము.

(అని తాయివలకునడువగా తాయియదృశ్యమై యహల్యలేచి
నిలువఁబడి దోసిలిబట్టి)

అహల్య—(దండకము.)

జయజయశ్రీరమాకాంత, భక్తాంతరంగప్రమోదప్రదా, స
ర్వసాక్షీ, జగత్కారణా, శుద్ధతేజంబవౌ నీవు సర్వప్రపంచస్వరూపం
బుగా మాఱి వేడ్కన్ విజృంభించి నీలోన సర్వంబుగొంచున్ ల
యంబొందఁగాఁజేసి క్రీడింతు వొక్కొక్కవేళన్ బ్రపంచంబునన్
దుష్టసంఘంబు హెచ్చైనికృష్టాత్ములన్ శిష్టసంఘంబులన్ గష్టము
ల్ పెట్టుచున్ ధర్మముల్ నెట్టుచున్ కర్మముల్ మెట్టుచున్ సర్వమున్
దారె యంచున్ బ్రివర్తిల్లఁ జితావతారంబులన్ భూమిపై నెత్తి

దుర్మార్గులఁ గెంప ధర్మంబుస్థాపింపవే మన్నవే. భూమిభారంబు పో
ద్రోయుచున్ బెంపవే పుణ్యమున్ సౌఖ్యమున్ లోకమం దెల్లడన్
సజ్జనుల్ మెచ్చగన్ సర్వకర్మాళి నిష్కామవృత్తిన్ బ్రవర్తించి నీ
యందె సంపూర్ణమౌ నమ్మికన్ భక్తియున్ గల్గి జీవించు భక్తాళి
కేయాపదల్ రాక యుండంగ రక్షింపవే సర్వసర్వంసహాధార యో
వీర, ధీరా, స్మరాకార, నీసేవయందే సదామగ్నులై యుండు శ్రీ
దేవియున్, భారతీకాంతుఁడున్, పార్వతీకాంతుఁడున్, నీమహాత్మ్యం
బు పూర్ణంబుగా గానరారన్న చో మూఢురాలన్ మహాపాతకిన్
స్త్రీని నేనెట్లు వర్ణింపగానేర్తు బ్రహ్మాండభాండమ్ములన్ సర్వదా కక్ష్య
మార్గంబులన్ గొప్పవేగంబుతో సంచరింపంగఁ జేయన్ బ్రచండ
ప్రభాదీప్తులన్ నిత్యమున్ దప్పకుండన్ సకాలంబునన్ సూర్యుఁ డే
తెంచి చీఁకట్లువాపన్ జనాకర్షణంబొప్పగాఁ జేసి మేఘంబులన్ గూ
ర్చి వర్షంబుచే సస్యవృక్షాదులన్ బెంపఁగా సర్వజీవాళి కాధారమై
వాయుదేవుండు కాలోచితంబైన మార్గంబునన్ వీచుచుండన్ సము
త్తుంగరంగత్తరంగంబులన్ సాగరుండేచి లోకంబు నాశంబు గాకుం
డ మేరన్ బ్రవర్తింపగా నీయలంఘ్యంబవార్యం బచింత్యంబు నీ
యాజ్ఞచేఁ గాదె దేవాధిదేవా దురూహప్రభావా, లసత్కీర్తిసాంద్రా,
కకుత్స్థాన్వయాంభోధిచంద్రా, నతాభీష్టనిస్తంద్రా, శ్రీరామచంద్రా
నమస్తే నమస్తే నమస్తే నమః. (అని ప్రణమిల్లును.)

రాము—అమ్మా, లెమ్ము నీవెవరో తెల్పుము.

అహ—

మ. తొలి నేఁ జేసిన పాపకర్మమున నెంతో హీనమౌ రాయిజ
న్మలభించెన్ బతిశాపమూలమున నింద్రద్రోహకృత్యంబునన్
జలజాతాసనపుత్త్రి గౌతమునిచానన్ నేనహల్యన్ త్వదీ
యలసత్పాదరజంబుసోఁకి నిజదేహం బందితిన్ ధన్యనై.

రామ:—ఓహో, గౌతమమహర్షి పత్నివైన యహల్యవేనా ?

అమ్మా, నమస్కారము.

(అని రామలక్ష్మణులు లిఱువురు నమస్కరింతురు.)

(విశ్వామిత్రునిజూచి) ఆర్యా! గౌతములవా రిప్పుడెక్కడ నున్నారు? వీరివృత్తాంతము సర్వము మీరిదివఱలో సెలవిచ్చియున్నం దున మాకుఁ దెలిసినది.

విశ్వా—అహల్య శిలయై యున్నప్పుడాయన గౌతమీనదీతీరమునఁ గోటిలింగక్షేత్రమున జపముచేసికొనుచు—

(తెరలో)

ఉ. ధన్యుఁడనైతి నేఁడు హరిదర్శనమయ్యెను యోగనిష్ఠచే
నన్యము సర్వముల్ విడిచి యాత్మత దేకవిలగ్నమైనయే
పుణ్యులకున్ లభింపని యపూర్వముదానహహా; యహల్యయే
ధన్యత గాంచె ముందుగను దర్శనలాభము గాంచి పూతయై.

అదిగో త్రికాలవేదియైన గౌతమమహర్షియే యిటకు వచ్చు చున్నాఁడు.

(గౌతముఁడు ప్రవేశించి "ధన్యుఁడనైతి" ననుపూ
ర్వోక్తపద్యమును జదువును.)

అహల్య—నాథా నమస్కారము. (అనిప్రణమిల్లి) చిరకాలమునుండి నేను వాంఛించుచున్న నీపాదసేవ తిరిగిలభించుటచే నేఁడు ధన్యురాలనైతిని.

గౌత—ప్రేయసీ! లెమ్ము. చిరకాలవిరహమనుభవించినతరువాత తిరిగి నన్ను బొందుటచే నీవు మునుపటికంటె వేయిమడుంగు లెక్కువగ నాకుఁ బ్రేమాస్పదురాలవగుచున్నావు. మఱియు నీవెవరిచేఁ బూతదేహవైతివో యామహాత్మునికి ముందుగ మన ము నమస్కరింతము. (అనిరామునివైపుదిరిగి)

సీ. శ్రుతిశిరోగ్రములందు సతతంబు చరియించు
సజ్జనపద్మములకు జోహారొనర్తు
శ్రీవధూటీకరాంచితపల్లవాన్విత
పాదపుష్పములకు వందనంబు
ఫణిరాజ యోగీంద్రహృదయబంధురగమ్య
చరణాబ్జముల నమస్కారమిడుదు
భక్తకోటి తరింప భవసాగరంబందు
ప్లవములౌ పదముల ప్రణుతిగొల్తు
గీ. పూర్వగాథలఁ దడవంగ బోవనేల
ఆయియా నీయహల్యను రమణిచేసి
బ్రోవఁజాలిన యీపదాంభోరుహముల
కేనొసర్తు వందనములు వేనవేలు.

రాము—మహాత్మా, మీరు పెద్దలట్లనుట జనదు. మీకే మేమనేకవేల వందనము లర్పించుకొనుచున్నారము.

(అని లక్ష్మణునితో సమస్కరించుచున్నాఁడు.)

గౌత—ఆధ్యాత్మికవృత్తిచే మాకెల్లరకు నీవువందనార్హుఁడవు. ప్రాపంచికవృత్తిచే లీలామానుషవిగ్రహుండవైన నీకు మేమువందనార్హులమైతిమి గాన నీయాశీర్వాదము బడయుము. మీరు దీర్ఘాయుష్మంతులరై గురుప్రతిజ్ఞాధురంధరులై లోకకంటకనిగ్రహణ నం బొనర్చి యశంబుగాంచి చిరకాలము ప్రజానురాగంబుగ రాజ్యపాలనముచేసి సమస్తసౌఖ్యంబులఁ గాంతురు గాక.

(అని విశ్వామిత్రునిఁ జూచుచున్నాఁడు.)

విశ్వా—తథాస్తు. అవతారముఖ్యోద్దేశమంతయు వెల్లడిచేసినాఁడు.

గౌత—మఱియు నొకనొకసంగతి. చిరకాలవియోగదుఃఖముచే గృశించియున్న నాకుఁదిరిగి యహల్యను నాడాధాతయిచ్చుటబద్ధ

ముగను నీవు నేఁడిచ్చుట నిజముగ ననుఁ గొనునట్లానంద పరవశునిగఁ జేసితివి గాన నీవు నచిరకాలముననే రూపలావణ్యాతిశయంబుల నద్వితీయయయు మహాపతివ్రతయుఁ గాఁదగు వనితారత్నముం బడయుదువు గాక.

విశ్వా—తథాస్తు. చేసిన కర్మకు ఫలము భగవంతునియట్టివానికిఁ గూడ ననుభవింపక తప్పదాయేమి మహాత్మా!

గౌత—(నవ్వుచు) మిత్రమా, విశ్వామిత్రా, లెస్సగాఁబల్కితివి కర్మఫలంబు లవశ్యమనుభోక్తవ్యములే. కాని నీయట్టి యపరవిధాతలు సృష్టికిఁ బ్రతిసృష్టి చేసి తప్పింపకుండ నుండవలెనుగదా!

విశ్వా—ధాతసృష్టికైన మార్పుగలుగునుగాని మీవాక్యములమోఘములు. ఇందులకు మీకథయే తార్కాణము.

గౌత—శ్రీరామచంద్రా, నీకింకేమైనఁ గోరికకలదా?

రాము—సర్వము మీదర్శనమువలననే సిద్ధించినవి. అయిన నిట్లగుగాక.

(భరతవాక్యము.)

ఉ. నీతియు సత్యమున్ వదలనేరక భూప్రజలుండ్రుగాక దు
ర్నీతిపరుల్ నిశాచరులబృందము నాశనమొందుగాక సత్
ప్రీతియు దైవభక్తియును వీడక యుందురుగాక యెల్లరున్
ఈతిభయంబులొందక మహీపతిపాలన మొప్పుగావుతన్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గౌతమ—
విశ్వా—
} తథాస్తు. తథాస్తు.

సంపూర్ణము.

—

# అనుబంధము — పాటలు.

(3 వ పేజీలో లయగ్రాహితరువాత నటి పాడవలసినది.)

బేహాగ్ రాగము—ఏకతాళము.

ఆహా వాసంతశోభ, నరయుమా సఖా
వే హరించు వెతలనెల్లఁ బ్రియము గదురగా — ఆహా.

2. ప్రివిమలమా విరిదేనియ, పానము సేయన్
గవలగూడి మధుపపాళి గానము సేయన్ — ఆహా.

3. మల్లెమొల్లలసౌరభముల్ మదికి హాయిగా
చల్లనితెమ్మెరలఁగూడి సౌఖ్యమీయఁగా — ఆహా.

4. పచ్చనిపత్రముల వృక్షపంక్తు లొప్పెడున్
హెచ్చగు పందిళ్లబోలె నింపుగూర్చెడున్ — ఆహా.

5. శుకపికశారికరవములు శ్రుతులకింపుగా
ప్రకటితముగ మాధవు నుద్వాహముచాటగా — ఆహా.

6. పండువెన్నెలగాయుచున్ బ్రపంచమంతయున్
వెండిపూతగానుదోప విరిసె నెంతయున్ — ఆహా.

(19 వ పేజీలో సీసపద్యముతరువాత ప్రథముఁడు పాడవలసినది.)

2. మాయామాళవగౌళ—త్రిశగతి.

ఎంతకష్ట మెంతకష్టము, ఈకరువుబాధ — ఎంత.
పంటలన్న మఱచినాము, పాఁడియన్న వెఱచినాము
వంటపొయ్యిలెల్ల బూజుపటియుండె నయ్యోయో — ఎం.

2. తిండిలేకయున్నగాని దేహశుద్ధి చేసికొనగ
దండిగానుతాగ్రి మనగ దయనొసంగు నీరుమాకు — ఎంత.

(21 వ పేజీ ఆఖరున "పోయివచ్చెదము" అను దానితరువాత

రైతు పాడవలసినది.)

3. కీరవాణి—ఆదితాళము.

సెలవీయుమా, శీఘ్రమ్ముగాను సెల.
కలకాలముపకారమైనరీతిగాఁజేయవిభునిగాంచింపుమా కై. సె

2. సతిధర్మములను సర్వమెఱుఁగునీకుఁ
జాలగాను జెప్పఁజాలమమ్మ మాకు సెల.

(24 వ పేజీలో ఇంద్రుఁడు ఆరంభములో పాడవలసినది.)

4. హిందుస్తానీకాఫీ—మిశ్రగతిరూపకము.

అకటా ధాతయే, యన్యాయంబుగా
ప్రవర్తింపగా, ప్రాపెవ్వరో అక.

2. వరారోహనన్ వరింపంగ నెంచన్
దురాలోచనన్ దూరంబుచేసెన్ అక.

3. సురాధీశ్వరున్ నన్ నరుం డిట్లుచేయన్
శరీరంబిటుల్ శక్యంబెతాల్పన్ అక.

(26 వ పేజీలోపద్యముతరువాత నింద్రుఁడు పాడవలసినది.)

5. జంఝూటి—ఝుల్వా.

అహా, యహల్యహాయిలు మఱువ నలవిగాదుగా
సహజంపురూపసంపదచేఁ జాలమీఱుగా అహా.

2. సరసంపువాక్య ఫణితిగీతసరణి నింపగున్
చిఱునవ్వువెన్నెలల మనంబు సేదదీఱెడున్ అహా.

(39 వపేజీలో ఇంద్రుఁడు "నాహరిణాంకవదన యహల్య"
యనుమాటలతరువాత పాడవలసినది.)

6. ఫీల్వా—ఏకతాళము.

కన్నులుగలభాగ్యము నేటికి నేగాంచగల్గితి ధన్యుఁడనై
యన్నులమిన్న యెదర్శనీయమీయఖిలసృష్టిలో నెన్నికయై. క.

2. కాంచినమాత్రమె గలదేసౌఖ్యముకాంతననున్ గనియేమనునో
పంచశరుఁడు విల్వంచెడునప్పుడె భాగ్యంబెట్టులగననౌనో. క.

(43 వ పేజీలో "అహో ఏమి యీమూర్ఖత" అనుమాటలకు
ముందు అహల్య పాడవలసినది.)

7. కుంతలవరాళి—ఆదితాళము.

సరిసరి తగునా సురనాథా
యరయ కిటులవాదా నాతో	సరి.

2. పరభామినులఁ బడయఁగ నెంచుట
సురకృత్యమొ యాసురకృత్యమొ గను	సరి.

3. ముల్లోకములఁ బూజ్యతగను నీ
వుల్లంఘితువె యుక్తమార్గమిటు	సరి.

(పై దిపాడినతరువాత వెంటనే యింద్రుఁడు పాడవలసినది.)

8 జంఝూటి—ఏకతాళము.

ఇంతకఠినమా యింతిరో నాయెడ నింతయు దయలేదా
సంతతంబునాస్వాంతమునఁ వసియింతువీవెకాదా	ఇం.

2. కంతుఁడు నన్నిటు కాఁకియవెట్టఁగ గాంతరోయిటులాడఁగా
న్యాయమెనీకు	ఇం.
పంతమేల నీపాలబడితినన్ బాలముంచెదవో నీటముంచెదో. ఇం

(44వ పేజీలో 'ఛీదురాత్మ' అనుమాటలముందు అహల్యపాడవలసినది)

9. హిందుస్తానీతోడి—ఆదితాళము.

అహ॥ ఔర, ఎంతసాహసము, పో, పో రా
సురపతివని గౌరవమున జూచినందులకింత నన్ను
చులుకజేసి కాఁకులాడజొచ్చితీవు నయమువీడి	ఔర.

ఇంద్ర॥ ఏల కాలహరణ మిటుల నింతిచేసెదు
మదనుఁ డెంతొ యదయుఁడగుచు బదునగుశరములబరపెదు

గదిసి శిక్షచేయరాదె కాంత క్రోధమూనినట్లు ఔర.

(47 వ పేజీలో సీసపద్యముతరువాత యిందుక్రింద పాడవలసినది.)

10. మలయమారుతము—ఆదితాళము.

ఎన్నో కల్గిన, హృదయశాంతియేది ఎన్నో.
సన్నుతాంగియొకతె సరసలేకయున్న ఎన్నో.

2. కాంతానివహములు, కల్పవృక్షములును
చింతామణియును, స్థిరయౌవనంబు
సంతసంబునిడగఁ జాలకుండెమదిని
కాంతాహల్య యొకతెగాని యొందులేక ఎన్నో.

(49 వ పేజీలో శచీదేవి నిష్క్రమించుచు పాడవలసినది)

11. కమాసు—మిశ్రగతి.

ఏమికీడుమూడునో, హృదయేశునకు ఏమి.
ఎంతజెప్పినగాని ఋషిపత్నిపై గల
భ్రాంతివీడడాయె బ్రతుకెట్లో గనడాయె ఏమి.
చెప్పిచూచుటగానె చేయింపనావశమె
యప్పరమేశ్వరునె తప్పింపధ్యానింతు ఏమి.

(70 వ పేజీలో దశరథుఁడు "అందుచే సంశయించుచుంటిని"
అను మాటలతరువాత పాడవలసినది.)

12. ఫీల్బా—మిశ్రగతి.

రామునిబాయుట ప్రాణముబాయుట
గానమ్మిమ తేజోనిధిగురువర రాము.

2. కాకపక్షములతోఁగ్రాలు ముద్దుమోము
నేకరణిని త్యజియింపగనోపుదును రాము.

3. లేకలేకయొకన్న యీకోమరులబాసి
సాకేతపురి నెట్లు చరియింపఁగలవాఁడ రాము.

(77 వ పేజీలో "ఛీఛీ" యనుమాటలకు ముందు
రాముఁడు చదువవలసినది.)

13. బ్యాండుస్వరముమాదిరి—శంకరాభరణము.

రాము॥ ఔరా, క్రూరా, ఘోరా, కారా
నీ శరీర మిదెయొక శరమునఁగూల్చెద ఔరా.
దురాత్ముండవై దుండగములఁ జేసి
పోరింబోరిగ ఋషిముఖ్యుని యాగము
చెఱిచెదవా, ఓతులువా
ఖరాసి నీతల ఖండించెదగను ఔరా.

మారీ॥ బాలుఁడవని నినుబాటిసేయక యె
జాలముచేసిన మూలమునన్
అఱచెదవా, మెఱుఁగుదు వా
లములో నీప్రాణము నేగొనుటను ఔరా.

(82 వ పేజీలో "మహాప్రసాదము" అనుమాటలతరువాత
రామలక్ష్మణులు పాడవలసినది.)

14. కీరవాణి—ఏకతాళము.

మహనీయములౌ విద్యలనొసఁగియు మమ్ము మన్పితివో
మానీంద్రా మహ.

2. బహుకష్టములనుబడయక క్షణముల్లో, కరగతముగ
విద్యగఱపిన నీదౌ
మహిమనుగొనియాడ మాకును శక్యమె
వందనశతము లర్పణ మొనరింతుము మహ.

(93 వ పేజీలో "ధన్యురాలనైతిని" అనుమాటలతరువాత
అహల్య పాడవలసినది.)

15. సురట—ఆదితాళము.

నా భాగ్య మేభాగ్యముః—ఆహా నాభాగ్య.

2. అనవరతముపతి యడుగుదమ్ములను
   కొల్వగదొరికెను కోరికదీఱెను — నా భా.

3. అఘములువాసెను ఆనందమాయెను
   రఘుపతియా శ్రీరాముని గాంచితి — నా భా.

# సరస్వతీ పవర్ ప్రెస్,

# రాజమహేంద్రవరము.



ఈముద్రాయంత్రము భాషాగ్రంథములు తెలుఁగు—సంస్కృతము—అరవము—ఇంగ్లీషుభాషలలో ముద్రింపఁ దలఁచువారికి మిక్కిలియనువుగ నుండును. ఇందు పుస్తకములు చక్కఁగ సంస్కరించుపండితులు గలరు. మిక్కిలిచక్కఁగా ముద్రింపఁ దలఁచువారందఱునీముద్రాయంత్రమున దమగ్రంథములు ముద్రించుట మంచిది.. మఱియు నితరము లగునచ్చుపను లన్నియు నిందు మిక్కిలిబాగుగఁ జేయఁబడును. అన్నిరకములఅచ్చుపనులు, ఎంగ్రేవింగుపనులు, బైండింగుపనులు మిక్కిలిసుందరముగాఁ జేయఁబడును.

విశేషాంశములు తెలిసికొనగోరువారు:—

శ్రీఅద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారు,

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము,

అని వ్రాయనగును.

## —: అనుబంధ గ్రంథములు :—

**మార్కండేయ**

3 గంటల కాలములో ప్రదర్శింపుటకు అనువుగ వ్రాయబడిన భక్తిపూరితమగు 6 అంకముల నాటకము. చక్కని పాటలు గలవు. వెల చందాదారులకు రు 0-8-0. ఇతరులకు రు 0-12-0.

**మృత్యురంగిణి**

అనుబంధముగా ప్రకటింపబడిన డిటెక్టివు నవల గను ణీపిశాచియగు యొకానొక సుందరీమణి యొక్క భయంకరకథ. నరహత్యా-నారీహత్యా-హత్యలు ... వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

**అభాగిని**

బాలవితంతువులు పడుకష్టములు-నాగరికులు ... సమాజదీనస్థితి చిత్రింపబడిన నవరసభరితమగు సాంఘికనవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

**భద్రవేషి**

ఇది చక్కని పరిశోధకనవల. వెల చందాదారులకు రు 0-8-0. ఇతరులకు రు 0-12-0.

**కాంచనమాల**

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మప్రచారముల గలుగు నవల. కుణాల కాంచనమాలల సచ్చరిత్రము మిక్కిలి రామణీయకము. వెల చందాదారులకు రు 0-8-0. ఇతరులకు రు 1-0-0.

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచింపజేసి రెండుమాసముల కొకటిగా ప్రకటింపబడుచుండును.

☞ 1924 వ సం॥ నవంబరు నెలలో వెలువడు పదునెనిమిదవ గ్రంథము

కాపవరపు నరసింహముచే రచింపబడిన

సాంఘికనవల

**"చిన్న కోడలు."**

సరస్వతీ గ్రంథమండలి,

రాజమహేంద్రవరము.

Printed by A. L. Swamy at Saraswathi Power Press:—Rajahmundry.